# స్వర్గీయ లాల్‌బహాదుర్ శాస్త్రి



జననం 2-10-1904 మరణం 11-1-1966

"చిన్నవాళ్ళయినా పెద్ద పనులు చెయ్యగలరు," అన్నాడు లాల్ బహదుర్‌శాస్త్రి. దానికి అయన జీవితమే నిదర్శనం. అయన సైజుకు చిన్నవాడు కావటమే గాక, పెద్ద పేరు ప్రఖ్యాతులు సంపాదించినవాడు కాడు. అయన పేరు దేశ మంతటా మారుమోగలేదు. గొప్ప వక్త కాడు. నిరాడంబరుడు, కార్యవాది, నియమశీలి, దీక్షాపరుడు. అయన విలువ అయన సన్నిహితులకు మటుకు బాగా తెలుసు.

అందుచేతనే, జవాహర్‌లాల్ నెహ్రూ లాటి జగద్విఖ్యాతిగల వ్యక్తి స్థానంలో అయన అనుయాయులు అయనను ప్రధానిగా నిలబెట్టారు.

1964 జూను ఆరంభంలో లాల్ బహదుర్‌శాస్త్రి భారత ప్రధాని అయినప్పుడు అనేకమంది ఉద్దేశం అయనకు ఘనత కట్టబెట్టారని. కాని 19 నెలల కొద్ది కాలంలో అయన తనకు స్వతహాగా ఘనత ఉన్నదని లోకానికి చాటి చెప్పాడు. మన దేశం అత్యంత విస్తృతమైన దేశాలలో ఒకటి. దీనికి శతకోటి సమస్యలు. వీటి వల్ల ఏర్పడిన భారం సామాన్యులకు అర్థమయేది కాదు. ఆ భారాన్ని విజయవంతంగా మొయ్యటమే గాక, శాస్త్రి ఈ అల్ప కాలంలోనే తన పేరు భారతచరిత్రలో చిరస్థాయిగా ఉండేటట్టు చేసుకున్నాడు. అయన ఆకస్మిక మరణం ప్రపంచ దేశా లన్నిటికీ దుర్వార్తే అయింది.

లాల్‌బహదుర్ 1904 అక్టోబరు 2న వారాణసి సమీపంలో ఉన్న మొగల్‌సరాయిలో జన్మించాడు. తండ్రి శారదాప్రసాద్ పేద బడి పంతులు. అయన అలహాబాదులో రివిన్యూ ఆఫీసు గుమాస్తా పదవికి మారి, లాల్‌బహదుర్ ఏణ్ణర్థం వయసువాడై ఉండగా పరమపదించాడు. అయన భార్య తన పిల్లలతో సహా పుట్టింటికి వచ్చేసింది. (అమె ఇంకా జీవించే ఉన్నది.)

లాల్‌బహదుర్ మాతామహుడు హజారిలాల్ పెద్ద అవిభక్త కుటుంబానికి పెద్ద. ఆరవ తరగతి పూర్తి చేసి లాల్‌బహదుర్ తన పదవ ఏట హైస్కూలు చదువుకు గాను వారాణసికి వచ్చి తన మేనమామ అయిన రఘునాథ్‌ప్రసాద్ ఇంట చేరాడు. వారాణసి మునిసిపాలిటీలో హెడ్ గుమాస్తాగా ఉంటూ ఉండిన రఘునాథ్‌ప్రసాద్ దృఢమైన నియమశీలాలు గలవాడు. అయన ప్రభావం లాల్‌బహదుర్ పైన బాగా ఉండేది.

బెనారెస్ హిందూ యూనివర్సిటీ భవనాలకు శంకుస్థాపన చెయ్యటానికి 1915 లో గాంధీజీ వచ్చినప్పుడు ఆయనను లాల్‌బహదుర్ మొదటిసారి చూశాడు. చిన్నతనం నుంచీ అతనిలో ప్రజాసేవాదర్శం ఉండేది. విద్యార్థిగా ఉంటూనే భారత సేవాసమితిలో చేరాడు. అదొక నాటు స్కౌటు ఉద్యమం. మరి కొన్ని ఏళ్ళ అనంతరం అతను—1926లో—లజ్పత్‌రాయ్ స్థాపించిన 'సర్వెంట్స్ ఆఫ్ ది పీపుల్ సొసైటీ'లో యావజ్జీవ సభ్యుడుగా కూడా చేరాడు.

1921లో గాంధీజీ సహాయనిరాకరణోద్యమం ప్రారంభించే నాటికి లాల్ బహదుర్ స్కూలు ఫైనల్ చదువుతున్నాడు. వారాణసిలో గాంధీజీ ఉపన్యసించాడు. లాల్‌బహదుర్ గాంధీజీని అనుసరించ నిశ్చయించి, స్కూలు మానేశాడు. మేనమామ ఆందోళన పడ్డాడు.

అయితే లాల్‌బహదుర్ చదువు మానెయ్యలేదు, కాశీ విద్యాపీఠంలో చేరి నాలుగేళ్ళు చదివి, "శాస్త్రి" అన్న పట్టం పొంది లాల్‌బహదుర్ శాస్త్రి అయాడు. శాస్త్రి విద్యాదశ పేదరికంలోనే గడిచింది. ఆ దశలోనే ఆయన సమన్వయ దృష్టి అలవరుచుకున్నాడు. ప్రజాసేవలో కాలం గడపటం ఆయనకు మంచి శిక్షణ అయింది.

1927 లో శాస్త్రి వివాహం జరిగింది. వధువు మీర్జాపూరుకు చెందిన లలితా దేవి. శాస్త్రి వరకట్నం కింద ఒక చరఖా, కొద్ది గజాల ఖద్దరుబట్టా కోరాడు—మామగారు ఇంకా హెచ్చు కట్నం ఇవ్వగలవాడే.

సర్వెంట్స్ ఆఫ్ ది పీపుల్ సొసైటీలో అలహాబాదులో పనిచేస్తుండగా శాస్త్రికి జవాహర్‌లాల్‌తో తొలిసారిగా పరిచయం కలిగింది. జవాహర్‌లాల్ లాగే శాస్త్రి కూడా కాంగ్రెసు ఉద్యమం మందకొడిగా ఉన్న కాలంలో మునిసిపల్ వ్యవహారాలలో జోరబడి పనిచేశాడు.

1930 లో గాంధీజీ సాగించిన శాసనోల్లంఘనోద్యమంలో శాస్త్రి రైతులను పన్నులు కట్టవద్దని ఉద్బోధించి రెండున్నర ఏళ్ళ జైలుశిక్ష పొందాడు. ఆటుతరవాత ప్రతి ఉద్యమం లోనూ జైలు యాత్రలు చేస్తూ, మొత్తం తొమ్మిదేళ్ళు జైలు జీవితం అనుభవించాడు.

1946 లో రాష్ట్రాలలో కాంగ్రెసు ప్రభుత్వా లేర్పడ్డాయి. అప్పుడు శాస్త్రికి మొట్టమొదటి సారిగా గోవిందవల్లభ

పంత్ ప్రభుత్వంలో కొద్ది కాలంపాటు పార్లమెంటరీ కార్యదర్శి పదవి లభించింది. అంతలో రఫీఅహ్మద్‌కిద్వాయ్ ఢిల్లీ వెళ్ళిపోయాడు, అప్పు డాయన నిర్వహిస్తూ ఉండిన మంత్రి పదవి శాస్త్రికి లభించింది. 1951 దాకా ఆ పదవి నిర్వహించి ఆయన రాజ్యసభకు ఎన్నుకోబడ్డాడు. అది మొదలు ఆయన కేంద్రంలో వివిధ శాఖలకు మంత్రిగా పనిచేసి పదిమంది కళ్ళపడ్డాడు. 1963 ఆగస్టులో కామరాజ్ పథకం కింద పదవులను విసర్జించిన వారిలో శాస్త్రి కూడా ఒకడు.

అయితే 1964 జనవరిలో భువనేశ్వర్ సమావేశంలో నెహ్రూకు ఆరోగ్య భంగం కలిగినప్పుడు శాస్త్రిని పోర్ట్‌ఫోలియో లేని మంత్రిగా నియమించారు. తనకు శాస్త్రి వారసుడుగా తరిఫీ దివ్వటానికి నెహ్రూ చాలా కృషి చేశాడు; వైదేశిక శాఖకూ, కాబినెట్ సెక్రటేరియట్‌కూ, పరమాణుశక్తికీ సంబంధించిన వ్యవహారాలను శాస్త్రికి అప్పగించాడు.

నెహ్రూ మరణించిన మీదట ఆయన స్థానంలో కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీ నాయకుడి పదవికి ఏకగ్రీవ ఎన్నిక జరగాలని కాంగ్రెసు అధ్యక్షుడు పట్టుబట్టాడు. అలా ఎన్నిక అయే గౌరవం లాల్‌బహదుర్‌శాస్త్రికి లభించింది. ఈ పదవిలో ఆయన ఎదుర్కొన్న సమస్యలు అత్యంత తీవ్రమైనవి— తిండి కరువు, పెరిగే ధరలు, కచ్‌లోనూ, కాశ్మీరులోనూ పాకిస్తానీయుల దురాక్రమణ. ఈ సమస్యలను శాస్త్రి ధైర్యంతో ఎదుర్కొన్నాడు. అన్నిటి కన్న ఆయన శక్తిసామర్థ్యాలను లోకానికి బాగా వెల్లడించినది సంధివిగ్రహాలలో ఆయన చూపిన ప్రతిభ. గత్యంతరం లేని పరిస్థితులలో శాస్త్రి పాకిస్తానుతో యుద్ధం సాగించటమే గాక, దేశ ప్రజలందరి సహకారాన్నీ పొంది, వారి దృష్టిలో ఉన్నతంగా పెరిగాడు. తిరిగి పాకిస్తానుతో సంధి చేసుకునే అవకాశం దొరికినప్పుడు అందులో కూడా శాస్త్రి తన సామర్థ్యాన్నీ, శాంతికాముకత్వాన్ని లోకానికి వెల్లడి చేశాడు. అదే ఆయన జీవితంలో అత్యున్నత క్షణం— అదే ఆయన భౌతిక జీవితానికి ఆఖరు క్షణం కూడా. తాష్కెంటులో, అయూబ్‌ఖాన్‌తో కలిసి సంయుక్త ప్రకటన చేసిన కొద్ది గంటలకు శాస్త్రి అకస్మికంగా దేహం చాలించాడు.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫొటో - శీర్షికల పోటీ. మరి ఎన్నో ఆకర్షణలు.

జపాను పిల్లలు కాగితాలతో చేసే
కత్తిరింపు బొమ్మల పుస్తకం

## ఊరిగామి ల్యాండ్

రంగు కాగితాల మడతలతో, కత్తిరింపులతో, జపాను దేశపు పిల్లలు ఎంతో చక్కటి బొమ్మలు తయారు చేస్తున్నారు, చక్కనైన జంతువులనూ, ముచ్చటైన పక్షులనూ, అందమైన పువ్వులనూ ఎన్నేళ్ళనుంచో చేస్తున్నారు. అలాంటి బొమ్మలను మన పిల్లలూ చేయవచ్చునే? స్వంత కల్పనతో, స్వహస్తాలతో ఒక జంతుశాల, లేదా ఉద్యానవనం, లేదా పడవల రేవు మన పిల్లలు తయారు చేయగా చూస్తే మన కెంత ముచ్చట? ఎంత ఆనందం?—ఇటువంటి చక్కటి బొమ్మలను ఎలా చేయాలో బోధించే అద్భుత పుస్తకం ఇప్పుడు సిద్ధంగా వుంది. దాన్ని కొని, తలిదండ్రులందరూ పిల్లలు బొమ్మలు చేసేందుకు ప్రోత్సహించాలి.

అందరకూ అర్థమయ్యే అతి సులభమైన ఇంగ్లీషు భాషలో ఈ పుస్తకం ప్రతులు దొరుకుతాయి.

వెల రూ. **2**

హిగ్గిన్‌బాదమ్స్ ప్రైవేట్ లిమిటెడ్,

165, మౌంటురోడ్డు :: మద్రాసు - 2




డిపోలు :

శ్రీ G. సుబ్బారావు,
డాక్టరు పుల్లక్కి స్ట్రీటు, తెనాలి

శ్రీ B. గోపాలకృష్ణమూర్తి,
1-3-166, రాజా ముదలియార్ స్ట్రీటు,
తలాగిగుడ, సికింద్రాబాద్

శ్రీ N. సత్యనారాయణ,
129/L5, రోడ్ నెం. 11,
B.H. ఏరియా, కద్మా, జంషెడ్‌పూరు

MFRS, అంబటి సుబ్బన్న & కో. సామర్లకోట

# నేర్చుకొనుటకు పశితనం ప్రతిబంధకంగాదు

మొక్కలకు అవి బ్రతికే నిమిత్తం నీళ్లు కావలెను అని చిన్న బాలురు పశితనమందే నేర్చుకుందురు. ఈ సామాన్యమైన యదార్థమును ఒక్క మాటు నేర్చుకుంటే ఇంకెన్నటికీ మరువరు.



మీ పిల్లలకు మీరు ఇప్పుడు నేర్పవలసిన మరియొక పాఠము. పళ్ల మరియు పసుచిగుళ్ల పట్ల రోజూ శ్రద్ధవహించుట, అందువల్ల భవిష్యత్తునందు కొన్ని సంవత్సరాలలో దంతక్షయం మరియు పసుచిగుళ్ల జబ్బులబారి బడకుండా వారిని కాపాడినందుకు వారు మీకు అభివందనములర్పింతురు. వారి పళ్లను మరియు పసుచిగుళ్లను ఫోర్‌హాన్స్ టూత్ పేస్టుతో తోముకొనుచూ భద్రపరుచుకోమని మీ పిల్లలకు నేడే బోధించండి. దంత వైద్యుని చేత తయారు చేయబడిన ఫోర్‌హాన్స్* పసుచిగుళ్లకు గుణకారియైన డాక్టర్ ఫోర్‌హాన్స్ యొక్క ప్రత్యేక పదార్థములు గల టూత్ పేస్టు ప్రపంచంలోకెల్ల ఇది ఒక్కటే. రోజూ వాడుచున్నయెడల పళ్లు తెల్లగా మెరయుచూ, పసుచిగుళ్లు గట్టిగాను ఆరోగ్యవంతంగాను వుండును. "CARE OF THE TEETH AND GUMS" అనే చిన్న రంగుల పుస్తకం ఉచిత ప్రతి కోసం తపాలా ఖర్చుల నిమిత్తం 10 న.పై. తపాలా బిళ్లలను పంపండి: మేనర్స్* డెంటల్ అడ్వయిజరీ బ్యూరో, పోస్టు బ్యాగ్ నం 10031, బొంబాయి.




**COUPON**

Please send me a copy of the booklet
"CARE OF THE TEETH AND GUMS"

*Name* ______________________

*Address* ______________________

______________________



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

కిందటి సంచికలో ప్రారంభమైన "సముద్రరాణి బానిసలు" ఈ సంచికలో పూర్తి అవుతున్నది. బానిసత్వం ఎంత దుర్భరమో, ఇతరులను దాస్యంలో ఉంచే వారు ఎంత అమానుషంగా ప్రవర్తిస్తారో, దాస్యం నుంచి విముక్తి పొందటానికి ఎంత యుక్తీ, ఎంత జాగ్రత్తా కావాలో ఈ కథ స్పష్టం చేస్తుంది. దేశాలకు బానిసత్వం సంప్రాప్తమయినా ఇలాటి కష్టాలే కలుగుతాయి.

"తెలివి గల గూఢచారి" అన్న కథలో శత్రువులు చేసే అమానుష చర్యలు చూడవచ్చు. హత్యాకాండ యుద్ధరంగం లోనే గాక ఇతరచోట్ల కూడా జరుగుతుంది. అందుకే ప్రపంచం శాంతిని కోరుతుంది. పూర్ణమైన శాంతి ఉంటేనే మానవత్వం పెరుగుతుందని మనం తెలుసుకోవాలి.

సంపుటి: 38 - ఫిబ్రవరి 1966 - సంచిక: 2



# భారత చరిత్ర



దేవగిరిని యాదవ రాజులు పాలించిన కాలంలో మహారాష్ట్రులు ఉత్తమమైన రాజకీయ, సాంస్కృతిక సంప్రదాయాలు నెలకొల్పుకున్నారు. కాని, అలా ఉద్దీన్ హయాంలో యాదవ రామచంద్రదేవుడు పతనం కావడంతో వారు తమ స్వాతంత్ర్యాన్ని కోల్పోయారు. అయితే మరి నలభై సంవత్సరాల అనంతరం వారిలో తిరిగి చైతన్యం కానవచ్చింది. బహమనీ రాజ్యంలోనూ, దాని అనంతరం వెలసిన సల్తనతుల లోనూ వారు ప్రముఖ పాత్ర నిర్వహించి, 17వ శతాబ్ది ఉత్తరార్థంలో భారత చరిత్ర లోనే అత్యంత ప్రాముఖ్యం సంపాదించుకున్నారు. ఈ శతాబ్దిలోనే మహారాష్ట్రులకొక జాతీయ రాజకీయ వ్యవస్థ ఏర్పాటయింది. వారి జాతీయ సమైక్యతను సాధించినది శివాజీ అయినప్పటికీ అతనికి పూర్వమే చాలా దోహదం జరిగింది.

అందుకు అనుకూలించిన అంశాలలో మహారాష్ట్ర నైసర్గిక స్వరూప స్వభావాలు కూడా ఉన్నాయి. మహారాష్ట్రం సులువుగా జయింపదగినది కాదు. ఉత్తరదక్షిణాలుగా ఉన్న సహ్యాద్రీ, తూర్పుపడమరలుగా ఉన్న వింధ్య, సాత్పుర పర్వతశ్రేణీ, నర్మదా, తపతీ నదులూ, దుర్జేయమైన అనేక కొండదుర్గాలూ మహారాష్ట్రానికి అంగరక్షలు. అక్కడి భూమి రాతి భూమి, వర్షం తక్కువ, వ్యవసాయానికి అనుకూలం కాదు; అందుచేత మహారాష్ట్రులలో భోగలాలసతా, బద్ధకమూ లేవు. వారిలో ఆత్మవిశ్వాసమూ, కృషీ, నిష్కపటమూ, ధైర్యమూ, కష్టజీవనంతో సంతృప్తీ, సాంఘిక సమతా, అభిమానమూ జాస్తి. ఏకనాథ్, తుకారామ్, రామదాస్, వామన పండిత్‌ల లాటి మత సంస్కర్తలు మహారాష్ట్రులకు శతాబ్దాల తరబడి సర్వమానవ



సమానత్వమూ, దైవభక్తి నూరిపోశారు, కులాన్ని బట్టీ, హోదాను బట్టీ అధికృత రాదన్నారు, కర్మ మార్గాన్ని బోధించారు. వీరి బోధల ఫలితంగా మహారాష్ట్రులలో కలిగిన ఉత్తేజనం విప్లవానికి నాంది అయింది. శివాజీ గురువైన రామదాస్ సమర్థ్ (సమర్థ రామదాసు) తాను రచించిన "దాసబోధ" అనే గ్రంథం ద్వారానూ, మఠాలలో శిష్యుల కిచ్చిన బోధలద్వారానూ, సంఘ సంస్కరణకూ, జాతీయ పునరుజ్జీవనానికీ అపారంగా తోడ్పడ్డాడు. సాంఘిక విప్లవకారు లందరూ తమ గేయాలను మహారాష్ట్ర భాషలో రచించారు. 15, 16 శతాబ్దులలో శక్తివంతమైన మహారాష్ట్ర సాహిత్యం ఏర్పడి, ప్రజలలో గొప్ప చైతన్యం తెచ్చిపెట్టింది. వీటన్నిటినీ బట్టి శివాజీ మహారాష్ట్రాన్ని ఏకచ్ఛత్రం కిందికి తీసుకు రాక పూర్వమే, మహారాష్ట్రులకు ఏక భాషా, ఏక సంస్కృతీ, ఏక జీవనమూ 17వ శతాబ్దిలో ఏర్పడ్డాయి. మిగిలి ఉన్నదల్లా ఏక రాజ్యమే, దాన్ని శివాజీ సాధించాడు. అతని కొడుకులు ఢిల్లీ దురాక్రమణను దీర్ఘ కాలం పాటు ప్రతిఘటించారు. పీష్వాల హయాములో మహారాష్ట్ర సామ్రాజ్య విస్తరణ కూడా జరిగింది.



దక్కను సల్తనతులలో కొలువు చేసిన కారణంగా మహారాష్ట్రులకు రాజకీయ పరిజ్ఞానమూ, యుద్ధ తంత్ర పరిజ్ఞానమూ లభించిన మాట కూడా నిజమే. శివాజీ తండ్రి అయిన శాహజీ అహమ్మద్‌నగరు సుల్తాను సైన్యాలలో అశ్విక సైనికుడుగా మొదట చేరి, క్రమంగా ఉన్నతికి వచ్చి, ఆ సంస్థానంలో విస్తృతమైన జాగీర్లు సంపాదించి, నిజామ్‌షాహి పరిపాలన చివరి దశలో తన ఇష్టం వచ్చినవాణ్ణి గద్దె ఎక్కించగల స్థితికి వచ్చాడు. ఆయన విజయం చూసి ఇతరులకు కన్నుకుట్టింది. అందుచేత, అహమ్మద్‌నగర్ సంస్థానం షాజహాఁ పరమై

నప్పుడు, 1636 లో ఆయన బిజాపూరు సుల్తాను కొలువులో ప్రవేశించాడు. ఇక్కడ కూడా ఆయన ఎంతో కీర్తి సంపాదించి, కర్ణాటక ప్రాంతంలో విస్తృతమైన మాన్యం సాధించాడు. ఇదిగాక, ఆయన అహమ్మద్ నగరు కొలువులో ఉండగా సంపాదించిన పాత జాగీరు ఆయనకు దక్కింది.

శివాజీ శాహజీ పెద్దభార్య కుమారుడు. అతను శివనేర్‌కొండ దుర్గంలో 1630లో జన్మించాడు. (బికనేర్‌కోట లైబ్రరీలో లభించిన శివాజీ జాతకచక్రం ప్రకారం 1627 సరిగా కనబడుతుంది.) శాహజీ తన పెద్ద భార్య అయిన జిజాబాయినీ, తన కొడుకు శివాజీనీ, దాదాజీఖోండదేవ్ అనే సమర్థుడైన బ్రాహ్మణుడికి అప్పగించి, తాను తన చిన్నభార్యతో సహా తన కొత్త జాగీరుకు వెళ్ళిపోయాడు.

జిజాబాయి అమిత ధర్మచింత గలది. ఆమె తన కొడుక్కు పాతకాలపు వీర గాథలూ, నీతి కథలూ చెప్పి, అతనిలో మతాభిమానం రేకెత్తించింది. శివాజీ జీవితం పై అతని తల్లి ప్రభావం అపారం. దాదాజీఖోండదేవ్ కూడా అతనిలో ధైర్య సాహసాలను బాగా నాటాడు.

శివాజీ చదువుకున్నదీ లేనిదీ మనకు తెలియదు. కాని అతను గొప్ప ధీరుడూ, సాహసీగా తయారై, విజాతీయుల నుంచి దేశమాతకు విముక్తి కలిగించాలనే దృఢ సంకల్పాన్ని అలవరుచుకున్నాడు. పశ్చిమ కనుమలలో మావల మనే ప్రాంతం ఉన్నది. దాని నిడుపు 90 మైళ్ళు, వెడల్పు సుమారు 12 లేక 14 మైళ్ళు. అక్కడ కొండజాతివారు నివసిస్తారు. శివాజీకి చిన్నతనంలోనే ఈ మావలీలతో సన్నిహితత్వం ఉండేది. అతను పెద్దవాడయాక ఈ పరిచయం బాగా అక్కరకు వచ్చింది. అతని తొలి సహచరులూ, ఉత్కృష్ట సైనికులూ, ఉత్తమ సేనాపతులూ మావలీలే.



# నేహ్రూ కథ

## 20



జవాహర్ తన అనుచరులతో జైతో చేరగానే అక్కడి బ్రిటిషు పరిపాలకుడు వారికొక ఉత్తరువు అందజేశాడు. ఆ ఉత్తరువు ప్రకారం జవాహరూ, అతని అనుచరులూ నాభాసంస్థానం ప్రవేశించరాదు, ఒక వేళ ప్రవేశిస్తే వెంటనే వెళ్ళిపోవాలి.

వారికి ఆ నోటీసులు నాభాలోనే అందజేయబడ్డాయి గనక ప్రవేశించరాదన్న మాటకు అర్థం లేదు. తిరుగు బండి ఎప్పుడున్నదో తెలియదు గనగ వెంటనే వెళ్ళిపోవటం కూడా సాధ్యమయేది కాదు. జవాహరు తనకు నోటీ సందించిన పోలీసు అధికారితో ఆ మాటే చెప్పి, తాము జత్థా వెంట రాలేదనీ, నాభా శాసనాలను ఉల్లంఘించే ఉద్దేశ మేదీ లేదనీ అన్నాడు. వెంటనే పోలీసు అధికారి వారు ముగ్గురినీ అరెస్టు చేసి, లాకప్‌లో ఉంచాడు.

పగలల్లా వారు లాకప్‌లో ఉన్నారు. సాయంకాలం పోలీసులు వారిని రైలు స్టేషనుకు నడిపించుకు పోయారు. సంతానం ఎడమ చేతికీ, జవాహరు కుడి చేతికీ కలిపి ఒక బేడీ వేశారు. దానికి తగిలించిన గొలుసును ఒక పోలీసు పట్టుకుని ముందు నడిచాడు. గిద్వానీ కూడా చేతులకు బేడీ తగిలించుకుని జవాహరూ సంతానంల వెనకగా వచ్చాడు. ఈ విధంగా ఆ ముగ్గురినీ—జవాహరు ఉద్దేశంలో కుక్కలను తీసుకుపోయినట్టు—జైతో వీధుల కుండా నడిపించారు. ఆ రాత్రి వారు మూడో తరగతి రైలు పెట్టెల సమ్మర్దం లోనూ, నాభా నగరం లాకప్‌లోనూ గడిపారు. మర్నాడు పూర్వాహ్నం నాభా జైలులోకి ప్రవేశించిన దాకా వారికి బేడీలు వదలలేదు.

నాభా జైలులో వారిని ఉంచిన కొట్టు చాలా అశుభ్రమూ, అనారోగ్యమూ అయి



నది. పై కప్పు ఇంచుమించు చేతి 'కందేలా గున్నది. రాత్రిపూట వారు నేల మీదనే పడుకున్నారు. వారి మీద ఎలుకలో, చుంచులో పరిగెత్తాయి.

రెండు మూడు రోజుల అనంతరం వారి విచారణ ప్రారంభమై, అత్యంత హాస్యాస్పదంగా నడిచింది. న్యాయాధికారికి ఇంగ్లీషు రాదు సరేకదా, రాతకోతలే వచ్చినట్టు కనబడలేదు. ఈ కేసు రోజుల తరబడి నడిచినా కూడా, ఆ మానవుడు కాగితం మీద కలం పెట్టటం జవాహరు చూడలేదు. విచారణ అంతా ఉర్దూభాషలో నడిచింది. జవాహర్ గాని అతని అనుచరులు గాని చిన్న చిన్న అర్జీలు దాఖలు చేస్తే, న్యాయాధికారి ఆ రోజు వాటి పై ఎలాటి ఉత్తరువులూ ఇచ్చేవాడు కాడు. అవి మర్నాడు మరెవరో రాసిన నోట్లతో సహా తిరిగి వచ్చేవి.

ఈ న్యాయస్థానంలో జవాహరు ప్రభృతుల పైన నడిచినది నిషేధాతిక్రమణ కేసు. దీని విచారణ జరుగుతూండగానే వీరి పై మరొక కుట్రకేసు బనాయించబడింది. కుట్ర కేసులో చేర్చటానికి కనీసం నలుగురు కావాలి కాబోలు. వీరు ముగ్గురే అయిపోయారు. అందుచేత వీరికి తెలియని ఒక సిక్కువాణ్ణి అరెస్టు చేసి ఈ కేసులో ఇరికించారు. ఈ కుట్రకేసు విచారణ మరొక చోట జరిగింది.

కుట్రకేసు బనాయింపూ, దాన్ని గురించి ముద్దాయిలకు ఎలాటి నోటీసూ అందజెయ్యక పోవటమూ, వారి తరఫున వాదించటానికి ఏర్పాట్లు లేకపోవటమూ చూసి లాయరైన జవాహరుకు ఆశ్చర్యం వేసింది. ఆయన జడ్జికి ఆక్షేపణ తెలిపితే, నాభా లాయరు నెవరినైనా వారి తరఫున వాదించటానికి ఏర్పాటు చేస్తామనీ, బయటి నుంచి లాయర్లు రావటానికి నాభా నిబంధనలు ఒప్పవనీ జడ్జి అన్నాడు. జవాహర్

ప్రభృతులు విసిగిపోయి, "మీ ఇష్టంవచ్చి నట్టు చేసుకోండి. ఈ విచారణలో మేము పాల్గొనేది లేదు," అని చెప్పేశారు.

అయితే అది పూర్తిగా సాధ్యం కాలేదు. తమను గురించి పచ్చి అబద్ధాలు చెబుతూంటే వింటూ ఊరుకోలేక జవాహరు ప్రభృతులు మధ్య మధ్య, సాక్షులను గురించి తమ అభిప్రాయాలు వెల్లడిస్తూ వచ్చారు. కొంత కాలంపాటు రోజూ రెండు విచారణలూ సాగాయి. మధ్యలో, బ్రిటిషు పాలకుడి తరఫున జైలు సూపర్నెంటు వారి వద్దకు వచ్చి, వారు పశ్చాత్తాపం వెలిబుచ్చి, నాభా సంస్థానం నుంచి నిష్క్రమించే పక్షంలో వారి పైన గల ఆరోపణలు ఉపసంహరించుకో బడతాయని చెప్పాడు. తాము పశ్చాత్తాప పడవలసిన దేమీ లేదనీ, నాభా అధికారులు తమకే క్షమాపణలు చెప్పుకోవలసి ఉన్నదనీ వారు అతడికి జవాబు చెప్పారు.

అరెస్టయిన పక్షం రోజులకు వారి విచారణలు రెండూ ముగిశాయి. నిందితులుగా వారు ఆత్మసమర్థన చేసుకోకపోవటం చేత ఆ కాల మంతా అభియోగాల చర్చలోనే గడిచింది. ప్రాసిక్యూషన్ వాదం ముగియగానే నిందితులు ఒక సుదీర్ఘమైన వాఙ్మూలం న్యాయాధికారికి అందజేశారు.





అది చదివే వ్యవధి కూడా లేకుండానే ఇంతలావు జడ్జిమెంటు కాగితాల కట్ట వచ్చేసింది! అది అంతకు పూర్వమే తయారై ఉండాలి. రెండు కేసులకూ కలిపి, వారి ముగ్గురికీ రెండేళ్ళ జైలు శిక్ష విధించబడింది.

ఈ అనుభవం ద్వారా జవాహరుకు, స్వతంత్ర సంస్థానాలను బ్రిటిషువారు ఎలా పాలిస్తున్నదీ కొంతవరకు తెలిసివచ్చింది. పోలీసు శాఖకు న్యాయాధికారులంటే ఖాతరు లేదు, న్యాయాధికారులకు పోలీసులంటే హడలు! ఏం జరిగినదీ తెలియదు. తీర్పు చెప్పిన రాత్రే జైలు సూపర్నెంటు వారు ముగ్గురినీ విడుదల చేసి రైలుస్టేషను దాకా పంపించాడు.

త్వరలోనే అంబాలా రైలు వచ్చింది. వారు దానిలో ఎక్కారు. జవాహరు అంబాలా నుంచీ ఢిల్లీకి వచ్చి, అక్కడి నుంచి అలహాబాదు చేరుకున్నాడు.

పదిహేను రోజులపాటు నాభా జైలులో ఉన్న ఫలితంగా ముగ్గురికీ సన్నిపాతజ్వరం వచ్చింది. జ్వరం ప్రమాదకరంగా వచ్చినప్పటికీ జవాహరు మూడు నాలుగు వారాలలో కోలుకున్నాడు.

ఈ నాభా గొడవ ఇంతటితో పోలేదు. మరో ఆరుమాసాల అనంతరం గిద్వానీ 500 మందితో కూడిన జత్థా వెంట జైతోకి వెళ్ళి తిరిగి అరెస్టు చేయబడి, విచారణ కూడా లేకుండా ఖైదు చేయబడి, ఆరోగ్యాన్ని పూర్తిగా కోల్పోయి, దాదాపు ఒక సంవత్సరం తరవాత విడుదల చేయబడ్డాడు. గిద్వానీ అరెస్టు వార్త విని జవాహరు తాను కూడా వెళ్ళాలనుకున్నాడు గాని, స్నేహితులు వద్దని సలహా ఇచ్చారు. తనకు లోపల నాభా జైలులో ఉండాలన్న భయం ఉండే తాను స్నేహితుల సలహా పాటించానని గ్రహించి, జవాహరు తరవాత చాలా సిగ్గుపడ్డాడు.





# నవాబునందిని

## 7

తన వద్దకు తానుగా వచ్చిన ఆయుషాను చూసి మానసింహుడు, "అమ్మా, నీవు కుమార్తె లాటి దానవు. రాజకీయ కారణాల వల్ల నీకు కొంచెం శ్రమ కలిగిస్తున్నందుకు నాకు విచారంగా ఉన్నది. నీ కేమైనా చెప్పుకోవలసినది ఉంటే నిస్సంకోచంగా చెప్పుకోవచ్చు," అన్నాడు.

"చెప్పుకోవటాని కేమీ లేదు. మీ అంతః పురంలో కొంతకాలం ఉండటానికి నా కెలాటి సంకోచమూ లేదు," అన్నది ఆయుషా.

"చెప్పటానికి నీ కేమీ లేకపోయినా, నేను వినవలిసినది చాలా ఉన్నది. నా ప్రశ్నలకు సరిఅయిన సమాధానా లిస్తే చాలా సంతోషిస్తాను."

"నా జీవితంలో రహస్యంగా ఉంచదగిన దేమీ లేదు. అందుచేత మీ రడిగే ప్రశ్నలకు నిజమే చెబుతాను."

"మీ వాళ్ళనందరినీ ఒరిస్సాలో విడిచి పాట్నా కెందుకొచ్చావు?"

"మీ కుమారుడు జగతసింహుణ్ణి చెర విడిపింతామని వచ్చాను."

"ఏ ఉపాయం ద్వారా ఆ పని చేద్దామనుకున్నావు?"

"యువరాజు వద్ద నుంచి పాదుషాకు విజ్ఞాపన పత్రం పంపించి."

"సుబేదారును నే నుండగా నాకు తెలియకుండా పాదుషాకు విజ్ఞాపన పత్రం ఎలా పంపుదామనుకున్నావు?"

దామోదర ముఖర్జీ





"మీరే కద అతనికి స్వయంగా శిక్ష విధించింది? దానికి విరుద్ధంగా జరిగే ప్రయత్నానికి మీరు సహాయపడతారా? అలా చేస్తే మీరు నవ్వులపాలు కారా?"

"విజ్ఞాపన పత్రం సిద్ధం కావద్దా?"

"అది ఎప్పుడో సిద్ధమయింది. ఈ పాటికి ప్రయాగ దాటి వెళ్ళి ఉంటుంది కూడా."

"జగతసింహుడి దొంగసంతకంతోనా?"

"కాదు, కారాగృహంలో ఉన్న జగతసింహుడు పత్రాన్ని చదువుకుని సంతకం చేశాడు."

"అతడు కారాగృహంలో ఉంటే ఎలా ఆ పత్రం అతనికి చేరింది?"

"అది సులభంగా జరగలేదు. కారాగారాధికారికి పెద్దలంచం పెట్టవలిసివచ్చింది."

"నీవు నిజంగా గొప్ప కార్యదీక్ష గలదానవే. విజ్ఞాపన పత్రం పాదుషా చేతి కందటానికి కూడా తగిన ఏర్పాట్లు చేశావా?"

"చేశాను. అది దర్బారుకు వెళ్ళిన మరుక్షణమే పాదుషాకు అందుతుంది, వెంటనే తగిన ఉత్తరువులు జారీ అవుతాయి. పని సానుకూలం కావటానికి ఎలాటి సందేహమూ లేదు."

ఈ మాట మానసింహుడికి చాలా ఆనందం కలిగించింది.

"నీ వింత కష్టపడి ఈ పని కెందుకు పూనుకున్నావో తెలుసుకోవాలని ఉన్నది," అన్నాడు మానసింహుడు. అయుషా జవాబు చెప్పక తల వంచుకున్నది.

"చెప్పటం నీ కిష్టం లేదు లాగుంది. నేను నిన్నా మాట అడగను. జగతసింహుణ్ణి కారాగృహంలో చూశావా?"

"లేదు."

"నీ సమాచారం అతనికి అందించావా?"

"లేదు."

"నీ కృషికి ఫలితంగా జగతసింహుడు విడుదల అయినప్పుడైనా అతన్ని చూస్తావా?"





"చూడను. ఆయన్ని చూడాలన్న కోరిక నాకు లేదు," అన్నది ఆయుషా.

ఆయుషాకూ, జగతసింహుడికీ మధ్య ఉన్న ప్రేమ పరిస్థితిని గురించి మానసింహుడు లోగడ విన్నదానికీ, ఆమె ఇప్పుడు చెప్పే సమాధానాలకూ బాగానే అతికింది.

"అమ్మా, రాజకీయ కారణాల వల్ల నిన్ను కొద్దికాలం నిర్బంధంలో ఉంచవలిసి వచ్చినందుకు నాకు చాలా బాధగా ఉన్నది. ఒరిస్సాలో పఠానులు యుద్ధం తెచ్చి పెట్టారు. నేను రేపక్కడికి బయలుదేరి పోతున్నాను. ఆ యుద్ధం ముగిసే దాకా నీవు యిక్కడే ఉండు. ఈ యుద్ధం గురించి నీవు చెప్పదగిన దేమైనా ఉన్నదా?" అని మానసింహుడు ఆయుషా నడిగాడు.

"ఆ విషయాలు ఆడవాళ్ళ కేం తెలుస్తాయి?" అన్నది ఆయుషా.

"ఉస్మాన్‌ఖాన్‌కు చెప్పవలిసిం దేమైనా ఉన్నదా?"

"ఏముంటుంది? నవాబు సాహసి, పరాక్రమవంతుడు. నే నతనికి సలహా లివ్వటం సాహస మవుతుంది. తాను చేయదలిచిన దాని పరిణామం ఎలా ఉండేదీ అతనికి తెలుసు. అతను దానికి సిద్ధపడే ఉంటాడు."



"యుద్ధం నుంచి తిరిగి వచ్చి నీతో తీరికగా మాట్లాడతాను. ఇప్పుడు నాకు చాలా పనులున్నాయి. తాజ్‌ఖాన్‌ను అతని ఇంటికి పంపెయ్యి," అంటూ మానసింహుడు వెళ్ళిపోయాడు.

పెద్ద ఎత్తున యుద్ధ ప్రయత్నాలు చేసుకుని మానసింహుడు ఒరిస్సాకు వెళ్ళాడు. వర్ధమానం నుంచి సయ్యద్‌ఖాన్ కూడా పెద్ద సేనతో వచ్చాడు.

పఠానులైనప్పటికీ తక్కువ సన్నాహం చెయ్యలేదు. సంధి భంగం వెంబడి యుద్ధం అనివార్యంగా జరుగుతుందని తెలిసినవాడు కావటం చేత ఉస్మాన్‌ఖాన్ అనేక మాసా





లుగా మొగలులతో - యుద్ధానికి సర్వ సన్నద్ధుడై ఉన్నాడు.

వనపూర్ సమీపాన ఉభయ పక్షాలూ తలపడ్డాయి. పఠానులు యుద్ధరంగంలోకి ఏనుగులను జాస్తిగా తెచ్చారు. మొగలాయీలు అనేక ఫిరంగులను తెచ్చారు. ఫిరంగుల కాల్పులు విని ఏనుగులు భయంతో వెర్రెత్తిపోయి, మావటివాళ్ళ చెప్పుచేతలలో ఉండక, సైన్యాన్ని ధ్వంసం చేస్తూ అన్ని వైపులా పరిగెత్తసాగాయి. పఠానులు ఏనుగులను తీసుకురావటం పొరపాటయింది. ఆ పొరపాటు వల్ల వాళ్ళ వ్యూహం కాస్తా చెదిరిపోయింది.



అయినప్పటికీ పఠానులు దీక్షతోనే పోట్లాడారు, యుద్ధం భయంకరంగానే సాగింది. కాని, మొదటి దెబ్బ నుంచి వారు కోలుకోలేక అపజయం పొందారు. వనపూర్‌లో విజయం సాధించిన మానసింహుడు అంతతో తృప్తి చెందక కోట వెంబడి కోటా, నగరం వెంబడి నగరమూ, ఆక్రమించుకుంటూ ఒరిస్సాను వశపరుచుకున్నాడు. జలేశ్వరమూ, కటకమూ, పఠానుల రాజధాని అయిన స్వర్ణదుర్గమూ మొగలాయీలకు ఓడిపోయాయి. ప్రతి కోట పైనా మొగలాయీ పతాక ఎగిరింది. ఉస్మాన్‌ఖాన్ గత్యంతరం లేక ఓటమి అంగీకరించాడు. సులేమాన్‌ఖాన్, ఉస్మాన్‌ఖాన్‌లు అక్బరుకు సామంతులు కావటానికీ, కప్పం కట్టటానికీ అంగీకరించారు. ఒరిస్సా మొగలు సామ్రాజ్యంలో చేరిపోయింది.

ఈ విజయానికి అక్బరు పాదుషా చాలా సంతోషించాడు, ఎందుకంటే ఒరిస్సా చాలా కాలంగా ఆయనకు పక్కలో బల్లెంగా ఉంటూ వచ్చింది. ఆయన మానసింహుణ్ణి బెంగాలు, బిహారులతో బాటు ఒరిస్సాకు కూడా సుబేదారుగా నియమించాడు.

చివరకిలా అవుతుందని ఉస్మాన్ కలలో కూడా అనుకోలేదు. అతని ఆశ





లన్నీ అడుగంటి పోయాయి. యుద్ధం చేస్తు న్నంత కాలమూ అతని మనస్సు నిలకడ లేక రకరకాల ఆందోళనలకూ, విచారా లకూ, బాధలకూ గురి అయింది. యుద్ధం కొద్దిరోజుల కారంభ మవుతుందనగా అయుషా అంతఃపురం నుంచి వెళ్ళిపో యింది. ఆమె వెళ్ళిపోవటంతో ఉస్మాన్ ఖాన్‌కు ప్రపంచ మంతా చీకటి అయిపోయి నట్టయింది. ఎందుకంటే అతను తన ప్రాణాలన్నిటినీ ఆమె పైనే నిలుపు కున్నాడు, తన ఆనంద మంతా ఆమెలోనే చూసుకున్నాడు. ఆమెతోనే అతని అదృష్టం కూడా వెళ్ళిపోయింది.



మానసింహుడి అంతఃపురంలో ఉన్న ఆయుషాకు పఠానుల అపజయ వార్తలు ఎప్పటికప్పుడు తెలుస్తూనే ఉన్నాయి. ఆమె అక్కడ ఉన్న రెండునెలల కాలంలోనూ ఉస్మాన్‌ఖాన్ పరిస్థితి అధఃపాతాళమంటింది. అతని అపజయాలకు నిరుత్సాహమే కారణ మనీ, నిరుత్సాహానికి తాను అతని సామీ ప్యాన్ని విడిచి వచ్చెయ్యటమే కారణమనీ ఆయుషా అనుకున్నది. తాను కృతఘ్నురా లుగా ప్రవర్తించా ననుకున్నది. తన కృత ఘ్నతకు ఫలితంగా ఒరిస్సా అంతా మొగలు లాక్రమించటమే గాక, ఉస్మాన్ ఢిల్లీ పాదుషాకు సామంతు అయిపోయాడు. అత నింకా ప్రాణాలతో ఉన్నాడంటే అది ఆయుషా కోసమే కావాలి.

మానసింహుడు త్వరలోనే పాట్నాకు తిరిగి వస్తున్నాడని తెలిసింది. ఆయన ఏ ఉద్దేశంతో నైతే తనను బందీని చేశాడో ఆ ఉద్దేశం నెరవేరింది; ఉస్మాన్ యుద్ధంలో దెబ్బ తిన్నాడు.

ఒకనాడు పగలు మూడుజాముల వేళ ఆయుషా వద్దకు తిలోత్తమ వచ్చింది. ఎంతో కాలం తరవాత వాళ్ళు తిరిగి కలుసుకున్నది ఇప్పుడే. ఇద్దరూ ఆలింగనం చేసుకుని కన్నీరు కార్చారు.





"నిన్ను మళ్ళీ చూస్తా ననుకోలేదు. నిన్ను నీ మామగా రాదరించినట్టు విని చాలా సంతోషించాను," అన్నది అయుషా.

"సంతోష మేముంది? ఆయన ఇంకా కారాగృహంలోనే ఉన్నారు," అన్నది తిలోత్తమ.

"వీరపత్ను లెంత ధైర్యంగా ఉండాలి! ఈ కాస్తకే విచారిస్తున్నావా? ఆయన త్వరలోనే విడుదల అవుతారు."

జగతసింహుడి విడుదలకు ప్రయత్నాలు జరుగుతున్నాయనీ, విజ్ఞాపన పత్రం తీసుకుని అభిరామస్వామి ఢిల్లీనగరాకి బయలుదేరి వెళ్ళాడనీ తిలోత్తమకు తెలియదు.



ఆ విషయాలన్నీ అయుషా ఇప్పు డామెకు చెప్పింది.

వారిద్దరూ జగతసింహుణ్ణి ప్రేమిస్తున్నవారే, కాని ఆ ప్రేమలలో ఎంతో వ్యత్యాసం ఉన్నది. జగతసింహుడి ఎడబాటు ప్రతిక్షణమూ తిలోత్తమను బాధిస్తున్నది. అయుషా అతన్ని తిరిగి చూడకుండా ఉండటానికి మనస్సును దృఢం చేసుకున్నది; తాను యువరాజును ప్రేమిస్తున్న సంగతి ఇతరులకు తెలియటం కూడా అమె కిష్టం లేదు, ఆఖరుకు జగతసింహుడికి కూడా తెలియరాదనే ఆమె ఉద్దేశం.

తిలోత్తమ మనస్ఫూర్తిగా అయుషాను తన సపత్ని కమ్మనీ, యువరాజును పెళ్ళాడమనీ, అతని ప్రేమను తా మిద్దరూ పంచుకోవాలనీ కోరింది. అయుషా ఆ కోరికను నిరాకరించింది. ఆమె తిలోత్తమను కౌగలించుకుని, "మన మిక కలుసుకోం. నేను ఒరిస్సాకు తిరిగిపోతాను. మొగలాయీలకూ పఠానులకూ సఖ్య మనేది పొసగనట్టే కనిపిస్తుంది. పఠానులు అంతరించిపోవటమే జరిగితే, అయుషా పేరు కూడా వారితోనే అంతరిస్తుంది. నేను చనిపోతే ఆ వార్త మీకు అందుతుందని కూడా అనుకోను. ఇదే మన ఆఖరి చూపు," అన్నది.





తరవాత ఊర్మిళ పిలుపు రాగా, తిలోత్తమ వెళ్ళిపోయింది.

మానసింహుడు తిరిగి వచ్చాడు. ఆయుషాకు నిర్బంధం చాలావరకు సడలింది, కాని, పూర్తిగా పోలేదు. తాజ్‌ఖాన్ కుటుంబం ఆమెను చూడవచ్చారు. అభిరామస్వామి ఢిల్లీకి పోయే దారిలో విజ్ఞాపన పత్రాలూ, ధనమూ, గుర్రాలూ చోరీ అయిపోయిన వార్త ఆమెకు తెలిసింది.

ఆయుషా ఉస్మాన్‌ఖాన్ కొక దీర్ఘమైన ఉత్తరం రాసింది. అందులో ఆమె తాను అతన్ని విడిచి వచ్చినందుకు క్షమాపణ చెప్పుకుంటూ పశ్చాత్తాపం ప్రకటించింది. తాను అందరూ అనుకున్నట్టుగా తన ఆస్తిపాస్తులు చూచుకోవటానికి బయలుదేరి రాలేదనీ, మరొక పని మీద వచ్చాననీ, ఆ పని త్వరలోనే ముగుస్తుందనీ, ఆ పని ముగియగానే తిరిగి వస్తాననీ తెలిపింది. ఆ ఉత్తరాన్ని తాజ్‌ఖాన్ ఇంటికి మనిషి ద్వారా పంపింది.

ఆ రాత్రి కొంచెం పొద్దుపోయాక మానసింహుడూ, ఊర్మిళా ఆయుషా కోసం మనిషని పంపారు. ఆమె వెళ్ళింది.

"అమ్మా నీ కిప్పుడు నిర్బంధం ఏమీ లేదు. ఇక ముందు ఏంచేయ దలిచావు?



ఎక్కడికి వెళ్ళా లనుకుంటున్నావు?" అని మానసింహు డడిగాడు.

"ఎక్కడికి వెళ్ళేదీ యింకా నిర్ణయించుకోలేదు. కొంచెం వ్యవధికావాలి, బహుశా ఢిల్లీకి పోతాను," అన్నది ఆయుషా.

"అక్కడే ఉండిపోవచ్చు. అక్కడ నీకు తెలిసిన వాళ్ళున్నా రనుకుంటాను. ఈ నాడు ఒరిస్సాలో పఠానులకు మిగిలినదేమీ లేదు. వారిని నీవు విడిచిపుచ్చవచ్చు," అన్నాడు మానసింహుడు.

"మీరు చేప్పేదాన్ని బట్టి నేను వారిని విడిచిపుచ్చక పోవటమే నా ధర్మ మవుతుంది. వైభవ సమయంలో వారి అండ



ఉన్న దాన్ని కష్టకాలంలో వారిని ఎలా విడిచి పుచ్చుతాను ?"

మానసింహుడి కీ మాట చెప్పుదెబ్బలా తగిలింది.

"నీ వెక్కడికీ పో నవసరం లేదు. నీవు మా దానివి. మా వద్దనే ఉండు," అన్నది ఊర్మిళాదేవి.

"అమ్మా, నా పైన నీకు మేర లేని ప్రేమ. కాని, యువరాజును విడిపించటా నికి నేను ఢిల్లీ వెళ్ళాలి," అన్నది అయుషా.

"అందుకు గాను విజ్ఞాపన పత్రాలు వెళ్ళాయిగదా ?" అన్నాడు మానసింహుడు.

"వాటిని దారిలో దొంగలెత్తుకు పోయా రట. నేను స్వయంగా వెళ్ళితే పని జరిగే అవకాశం ఉన్నది."

"శిక్ష పొందిన వాడి కిలా సహాయ పడటం అపరాధ మవుతుంది. దాన్ని ఒక సారి క్షమించాను. ఈ సారి క్షమించను, నిన్ను శిక్షిస్తాను," అన్నాడు మానసింహుడు.

"శిక్షించే అధికారం మీ కున్న మాట నిజమే గాని, దాన్ని మీరు వినియోగించు కోరు," అన్నది అయుషా.

"ఎందుచేత?" అన్నాడు మానసింహుడు.

"మీకు కావలిసింది యువరాజు విడు దలే గనక! మీ ప్రతిష్ఠ పెంపొందించుకోవ టానికి మీ కుమారుణ్ణి మీ చేత్తోనే శిక్షిం చారు. కాని అతను శిక్ష అనుభవించటం మీ కిష్టం లేదు."

"ఇందులో నీ స్వార్థం మటుకు లేదా?"

"ఇద్దరిదీ స్వార్థమే అయినప్పుడు మీరు నన్ను దండించి ఏం సుఖపడగలరు ?"

ఊర్మిళ కల్పించుకుని, "ఏమయేది, నిన్ను మాత్రం నేను నా కోడలుగా చేసుకో కుండా వదిలిపెట్టను," అన్నది.

"అమ్మా, నే నంత అదృష్టానికి నోచుకో లేదు. నా భవిష్యత్తు అదివరకే నిర్ణయమై పోయింది," అన్నది అయుషా.

—(ఇంకా ఉంది)






# భాగస్వాములు

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు మీది నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు పడే ఈ శ్రమ ఫలించాక ఆ ఫలితాన్ని నీవు పొందుతావో, లేక భైరవుడి లాగా జార విడుస్తావో నాకు తెలియటం లేదు. శ్రమ తెలియకుండా ఉండగలందులకు నీకు ఆ భైరవుడి కథ చెబుతాను, విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

భైరవుడు ఒక మారుమూల గ్రామంలో పుట్టాడు. అతనికి చిన్న వయసులోనే తండ్రి పోయాడు. వాళ్ళు నిరుపేదలు కారు, కష్టం చేసుకుంటే జీవితం లోటు లేకుండా వెళ్ళి పోతుంది. భైరవుణ్ణి తల్లే పెంచింది, చదువు చెప్పించింది. పెరిగి పెద్దవాడై విద్యా బుద్ధులు అలవరచుకున్నాక, తన కుగ్రామంలో కష్టజీవితం గడిపేకన్న, కొద్ది

## బేతాళ కథలు



పెట్టుబడితో వ్యాపారం చేసి, తాను సుఖ పడి తల్లిని సుఖపెట్ట వచ్చునని భైరవుడికి అనిపించింది. అందుచేత అతను పెట్టుబడి సంపాదించు కుందామని నగరానికి బయలు దేరాడు. ఖర్చుకుగాను కొంత డబ్బూ, తన తల్లి నగలూ వెంట తీసుకున్నాడు.

కొంత దూరం వెళ్ళాక ఒక ఊరి బయట భైరవుడి కొక విషాదకరమైన దృశ్యం కన బడింది. ఒక యువకుడు ఒక స్త్రీ శవం ముందు కూర్చుని కంటికీ మంటికీ ఏక ధారగా ఏడుస్తున్నాడు. భైరవు డా యువ కుణ్ణి సమీపించి, "ఎవరు నాయనా, నువు? ఈ చనిపోయిన మనిషి ఎవరు? ఈ నిర్జన ప్రదేశంలో కూర్చుని ఎందు కేడుస్తు న్నావు?" అని అడిగాడు.

"నే నొక అభాగ్యుణ్ణి. ఈ చనిపోయినది నా భార్య. నా తండ్రి పేరుపడిన సముద్ర వర్తకుడు. ఆయనతోబాటు మూడు ఓడలు సరుకుతో సహా సముద్రం పాలయ్యాయి. నాకు మా వ్యాపారం తాలూకు అప్పులే మిగిలాయి. నా కున్న ఆస్తి అంతా అమ్మినా ఆ అప్పులు పూర్తిగా తీరలేదు. అవమా నంతో నగరంలో బతక లేక ఈ పక్కనే ఉన్న గ్రామంచేరి అక్కడ నేనూ నా భార్యా అజ్ఞాతవాసం గడిపాం. నిన్న రాత్రి నా భార్య చనిపోయింది. గ్రామస్తులను యాచించటం చాతగాక శవాన్ని మోసుకుని ఇక్కడికి చేరుకున్నాను. ఈ శవానికి దహనం చేసే దక్షత కూడా నాకు లేదు," అంటూ ఆ యువకుడు పెద్ద పెట్టున ఏడిచాడు.

"విచారించకు. నేను గ్రామంలోకి వెళ్ళి దహన క్రియలకు ఏర్పాటు చేస్తాను," అన్నాడు భైరవుడు.

"క్షమించండి! నేను మీ వద్ద దానం పట్టలేను, అప్పూ చెయ్యలేను. నేను కూడా ఇక్కడే ప్రాణాలు విడిచినాక ఏ నక్కలో పీక్కుతింటాయి, లేదా, మా ఇద్దరి అనాథ ప్రేతాలకూ కలిపి ఎవరో ఒకరు సంస్కారం

చేసేస్తారు. మీ దారిన మీరు వెళ్ళండి. నా సమస్య మనుషులు తీర్చేది కాదు," అన్నాడా యువకుడు.

భైరవు దతనితో, "నేను నీకు దానమూ ఇవ్వటంలేదు, అప్పు పెట్టటంలేదు. నేను వ్యాపారం చేద్దామనే బయలుదేరాను. నా దగ్గిర కొద్దిగా డబ్బున్నది. అది నేను నీ కోసం ఖర్చు చేస్తాను. నువు నా భాగస్వామివిగా ఉండి వ్యాపారం చెయ్యి. రాబడి చెరిసగం. నన్ను భాగస్వామిగా పెట్టుకుని వ్యాపారం చెయ్యటం నీకు సమ్మతమైతే నా డబ్బు తీసుకో," అన్నాడు.

"అయ్యా, నీ డబ్బుతో నా భార్యకు దహనసంస్కారం చేస్తే, మనకు పెట్టుబడి ఏదీ? నా దగ్గిర చిల్లి గవ్వలేదు," అన్నాడా యువకుడు.

"నా దగ్గిర మా అమ్మ నగలున్నాయి. వ్యాపార రహస్యాలు తెలియని నా బోటి వాడికి ఆ డబ్బు చాలకపోవచ్చు, కాని నీ కవి తెలుసు గనక, వాటితోనే చిన్న ఎత్తున ప్రారంభించవచ్చు," అన్నాడు భైరవుడు. అందు కా యువకుడు సరే నన్నాడు.

భైరవుడు గ్రామానికి వెళ్ళి శవవాహకులనూ, ఒక బ్రాహ్మణ్ణీ మాట్లాడి, శవదహనానికి కట్టెలు ఏర్పాటు చేసి, సమీపంలోనే



చెరువు పక్కన ఉన్న శ్మశానంలో చనిపోయిన మనిషికి దహన క్రియలు జరిపించాడు. యువకుడి పేరు కుమారగుప్తు డని భైరవుడికి తెలియవచ్చింది.

శవదహనం పూర్తి అయాక బాగా చీకటి పడింది. భైరవుడూ కుమారగుప్తుడూ చెరువులో స్నానం చేసి, చెరువు గట్టునే పడుకున్నారు. తెల్లవారు జామున భైరవుడి కొక కల వచ్చింది. ఆ కలలో కుమారగుప్తుడి భార్య కనిపించి, "అయ్యా, మీరు నా భర్తకు కొత్త జీవితం ఇచ్చారు. అందుకు కృతజ్ఞతగా మీ కొక రహస్యం చెబుతాను. నా బూడిద గుడ్డివాళ్ళ కళ్ళకు రాచి



నట్టయితే వాళ్ళకు తిరిగి దృష్టి వస్తుంది," అని చెప్పి మాయమయింది. వెంటనే అతనికి మెలకువ వచ్చింది.

భైరవుడు నిద్రలేచి తనకు వచ్చిన కల గురించి ఆశ్చర్యపడ్డాడు. తన కలను అతను నమ్మలేక పోయాడు. కాని కుమార గుప్తుడి భార్య కలలో అన్నమాట ఇంకా అతని చెవిలో గింగురుమంటూనే ఉన్నాయి. ఎందుకైనా మంచి దనుకుని భైరవుడు, కుమారగుప్తుడు నిద్ర లేవక ముందే శ్మశానం లోకి వెళ్ళి, ఆరిపోయిన చితి నుంచి కొంత బూడిద తీసుకుని మూట గట్టుకున్నాడు.

తెల్లవారుతూనే స్నేహితులిద్దరూ కాల కృత్యాలు తీర్చుకుని బయలుదేరి, మధ్యాహ్నని కల్లా ఒక నగరం చేరుకున్నారు. అక్కడి సత్రంలో వారు బస చేశారు. సత్రం అరుగు మీద ఒక గుడ్డి బిచ్చగాడు వారికి కనిపించాడు. భైరవుడు తన మూట నుంచి చిటికెడు బూడిద తీసి ఆ బిచ్చ గాడి కళ్ళకు రాచాడు. వెంటనే వాడికి దృష్టి వచ్చేసింది. వాడు వెలుగు చూడలేక కళ్ళు చిట్లిస్తూ, "న్లాకు చూపొచ్చిందర్రా! చూపొచ్చింది!" అని కేకలువేశాడు.

ఈ సంగతి అతి శీఘ్రంగా నగరమంతటా వ్యాపించింది. ఎక్కడెక్కడి గుడ్డివాళ్ళూ వచ్చి భైరవుడి చేత చికిత్స చేయించు కున్నారు. అంతలోనే రాజుగారి దివాణం నుంచి భైరవుడికి పిలుపు వచ్చింది. ఆ వూరి రాజుగారికి కొంత కాలంక్రితం అకస్మికంగా కళ్ళు రెండూ పోయాయి. ఎంత మంది వైద్యులు ఎన్ని చికిత్సలు చేసినా ఆయనకు దృష్టి తిరిగి రాలేదు. ఎవడో పరదేశి సత్రంలో దిగి గుడ్డితనానికి చికిత్స చేస్తు న్నట్టు తెలిసి రాజుగారు అతన్ని పిలుచుకు రమ్మని తన మనుషులను పంపాడు. కుమారగుప్తుణ్ణి సత్రంలోనే ఉండమని చెప్పి భైరవుడు రాజభవనానికి వెళ్ళాడు.

రాజవైద్యులు భైరవుణ్ణి అనేక ప్రశ్నలు వేశారు. అతను ఎవరి దగ్గిర వైద్యం నేర్చుకున్నాడు? అతను ఉపయోగించే భస్మంలో ఏ మేమి దినుసులున్నాయి? ఎన్ని పుటాలు వేసిన భస్మం?

"నేను వైద్యుణ్ణికాను. నేను వాడే భస్మం ఏ వైద్యుడికీ దొరికేది కాదు. దానితో దృష్టి కలుగుతున్నంత కాలమూ ఉపయోగిస్తాను," అన్నాడు భైరవుడు. అతను రాజుగారి కళ్ళకు బూడిద పూయగానే రాజుగారికి తిరిగి కళ్ళు వచ్చాయి.

"మహారాజా, ఇక నాకు సెలవిప్పించండి," అన్నాడు భైరవుడు.

"నా కింత మహోపకారం చేసిన నీకు తగిన ప్రత్యుపకారం చెయ్యకుండా పంపనా?" అంటూ రాజుగారు భైరవుణ్ణి పరీక్షగా చూశాడు. యువకుడు అందంగానే ఉన్నాడు. అందుచేత ఆయన అతనితో, "చూడు, నాయనా, నా కళ్ళకు వైద్యులు చికిత్స చెయ్యలేక పోవటం చూసి, నాకు దృష్టి ఎవరన్నా తెప్పించినట్టయితే వాడికి నా కుమార్తె నిచ్చి పెళ్ళి చేద్దామనీ, అర్ధ రాజ్యం ఇద్దామనీ నిశ్చయించాను. అందుచేత నువు నా కుమార్తెను పెళ్ళాడి, నా అర్ధరాజ్యానికి పట్టాభిషిక్తుడివి కా!" అని చెప్పాడు.



"క్షమించండి. నేను ఈ చికిత్స చేసి నందుకు అలాటి ప్రత్యుపకారం పొందలేను. నాకు సెలవిప్పించండి," అని చెప్పి భైరవుడు సత్రానికి తిరిగి వచ్చి, కుమార గుప్తుణ్ణి వెంట బెట్టుకుని మరొక నగరానికి వెళ్ళి, తన తల్లి నగలమ్మి వ్యాపారం ప్రారంభించాడు.

వ్యాపారం కుమారగుప్తుడి మూలాన బాగా కలిసి వచ్చింది. ఇద్దరూ కొద్ది కాలం లోనే ధనవంతులయారు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం. భైరవుడు రాజకుమార్తెను పెళ్ళాడి అర్ధరాజ్యం ఏలుకోక పోవటానికి కారణమేమిటి? రాజ్యమంటే భయమా? లేక పెళ్ళి అంటే భయమా? అతను రాజు గారిని కనీసం పెట్టుబడి ధనమైనా ఎందు కడగలేదు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "భైరవుడూ, కుమారగుప్తుడూ భాగస్వాములై, రాబడి చెరిసగమూ తీసుకోవటానికి సమ్మతించారు. చితాభస్మం కూడా వారి ఉమ్మడి సొత్తే గాని భైరవుడి సొంతం కాదు. అలాటప్పుడు, దాన్ని ఉపయోగించి రాజుగారికి కళ్ళు తెప్పించిన భైరవుడు తన స్నేహితుడితో పంచుకోవటానికి వీలులేని భార్యనూ, రాజ్యాన్నీ ఎలా కోరుతాడు? వాటిని నిరాకరించాక అతను రాజుగారి నుంచి డబ్బూ, మడిమాన్యాలూ కోరటం అనుచితం అవుతుంది. రాజకుమార్తె కన్నా, అర్ధరాజ్యం కన్నా వాటి విలువ హెచ్చున్నట్టు స్ఫురిస్తుంది. ఆ కారణం చేత భైరవుడు రాజు వద్ద ఎలాటి ప్రతిఫలమూ తీసుకోలేక పోయాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# కలలోని నిజం

ఒక దేశంలో కిళిందకు డనే వాడికి కరాళ కంఠి అనే పరమ గయ్యాళిభార్య ఉండేది. కరాళకంఠికి బంగార మంటే తగని వెర్రి. బంగారం సంపాయించుకు రమ్మని భర్తను అస్తమానమూ వేపుకుతింటూ ఉండేది. భార్య పెట్టే పోరుతో జీవితం నరకమైపోయి, కిళిందకుడు ఆత్మహత్య చేసుకోవాలని నిశ్చయించుకుని, అడవికిపోయి, ఒక చెట్టు కొమ్మకు తాడు కట్టి, దాని చివర ఉచ్చు పెట్టి, ఉచ్చులో తలదూర్చి గొంతుకు ఉరిపోసు కున్నాడు.

అయితే కిళిందకుడు చావలేదు. చెట్టు కొమ్మ విరిగి పడటం చేత అతని మెడ చుట్టూ ఉచ్చు బిగియలేదు. అతని పాట్లు చూస్తూ చెట్టులో ఉండిన యక్షుడు ప్రత్యక్షమై, కిళిందకుడు జీవితం పైన విరక్తి చెందిన కారణం తెలుసుకుని, "ఈ గింజలు మూడూ తీసుకుని ఇంటికి పో. రోజూ, రాత్రి నిద్రపోయే ముందు ఒక గింజ చొప్పున మింగు. వీటి మహిమ వల్ల నీకు బంగారం లభిస్తుంది," అని చెప్పి, మూడు గింజలు కిళిందకుడి చేతిలో పెట్టి అదృశ్య మయాడు.

కిళిందకుడు ఆ గింజలను ఇంటికి తీసుకుపోయి, ఆ రాత్రి పడుకునేటప్పుడు ఒక గింజ మింగాడు. వెంటనే అతనికి మంచి నిద్ర పట్టేసింది. ఆ నిద్రలో అతనికి ఒక అపూర్వమైన కల వచ్చింది. అందులో అతను ఇంటి నుంచి నడుచుకుంటూ, ఎన్నడూ ఎరగని వింత ప్రదేశాల మీదుగా ఒక లోయలోని కొలను చేరుకున్నాడు. కొలను గట్టున ఎవరో దేవతాస్త్రీ ఎవరి కోసమో ఎదురు చూస్తున్నదాని లాగా కూర్చుని ఉన్నది. కొలనులో ఒకే ఒక బంగారు తామరపువ్వు ధగధగా మెరుస్తూ కిళిందకుడి కంట పడింది. అతనా తామరను అదేపనిగా చూస్తూండటం గమనించి

"శవిరామ్"



ఆ స్త్రీ చిరునవ్వు నవ్వి, దాన్ని కోసి అతని కిచ్చి, "వెనక్కు తిరిగి చూడకుండా ఇంటికి పో," అన్నది.

తెల్లవారి కిళిందకుడు లేచి చూసుకునే సరికి, తామరపువ్వు ఆకారంలో బంగారం అతని చేతిలో ఉన్నది. తాను రాత్రి కలలో చూసినది ఈ రూపంలో నిజమయిం దను కుని, అతను ఆ బంగారాన్ని తన భార్య కర్పించి, తన కల గురించి వివరంగా ఆమెకు చెప్పాడు.

తన భర్త అంత బంగారాన్ని తన కిచ్చి నందుకు సంతోషించి భర్తను మెచ్చుకోవ టానికి మారుగా, "అంత కొలను నుంచి సాధ్యమైనన్ని తామరపూలు తీసుకురాక ఒకే ఒకటి తెస్తావా?" అని భర్త మీద పడి చావగొట్టింది.

మర్నాడు రాత్రి పడుకోబోతూ కిళింద కుడు మరొక గింజ మింగాడు. వెంటనే అతని శరీర బాధలన్నీ ఉడిగి, సుఖమైన నిద్ర పట్టింది. తిరిగి అదే కొలనూ, అందులో ఒకే ఒక బంగారు తామరపువ్వూ, అదే దేవతాస్త్రీ కలలోకి వచ్చాయి. ఈ సారి కూడా ఆ స్త్రీ అతనికి బంగారు తామర పువ్వు కోసి యిచ్చి, పంపేసింది.

తన భర్త మళ్ళీ ఒక్క బంగారు తామరే సంపాదించటం చూసి కరాళకంఠి

పట్టరాని ఆగ్రహంతో భర్తను వీధిలోకి ఈడ్చుకుపోయి పెద్ద గలాటా చేసింది. పది మందీ పోగయారు. వ్యవహారం రాజుగారి దాకా వెళ్ళింది. రాజుగారు ఆ భార్యా భర్తలను పిలిపించి, "మీరు దేనికి వీధినపడి కొట్లాడుకున్నారు?" అని అడిగాడు.

కిళిందకుడు జరిగినదంతా ఉన్న దున్నట్టు చెప్పాడు. కీర్తిప్రతాప మహారాజు తాను విన్నది నమ్మలేక, కిళిందకుణ్ణీ, అతని భార్యనూ తన భవనంలోనే ఉండమని, ఆ రాత్రి తాను పడుకోబోయే టప్పుడు, కిళిందకుడి వద్ద మిగిళిన మూడో గింజ మింగి పడుకున్నాడు.

రాజు కూడా నిద్రలో కొలను చేరుకున్నాడు. కాని అతను కొలను కేసి చూడనే లేదు. దాని గట్టున ఉన్న దేవతాస్త్రీ వద్దనే అతని దృష్టి ఆగిపోయింది. రాజామెను మోహించి పట్టుకోబోయాడు.

ఆ స్త్రీ దూరంగా పరిగెత్తి, అతన్ని వారిస్తూ, "రాజా, ఆగు. నేను స్వతంత్రురాలిని కాను. అలా కొలను కేసి ఒకసారి చూడు," అన్నది.

రాజు కొలనులోకి చూసేసరికి కొలనంతా రక్తంతో నిండి ఉన్నది. అందులో పాము తలలు విషజ్వాలలు కక్కుతూ మహా భయంకరంగా ఉన్నాయి.



"రాజా, నేను రాజ్యరమను. నా పై దృష్టి లేనివారికి ఆ పాముతలలు బంగారపు తామరలుగా కనిపిస్తాయి. ఆ తలలు కల వాడు రాక్షసభుజంగుడు. అతడు నన్నిక్కడి నుంచి కదలనివ్వడు. నన్నెవరైనా తాకి నట్టయితే ఇద్దరికీ ప్రమాదం కలిగిస్తాడు. వాడు నశించనిదే నేను నీకు దక్కను," అన్నదా స్త్రీ. కీర్తిప్రతాపుడు వెంటనే ఒర నుంచి కత్తి దూశాడు.

"రాజా, తొందరపడకు. వాడు ఎవరి వల్లా, ఏ ఆయుధం చేతా చావడు. వాడికి ఒకే విధంగా చావున్నది. నన్ను నిజంగా ప్రేమించిన వాడి హృదయ రక్తం వాడి తలల మీద చిలకరిస్తే వాడు చస్తాడు," అన్నది రాజ్యరమ.

"అలా అయితే నా హృదయ రక్తం వాడి తలల పైన చిలుకు," అంటూ కీర్తి ప్రతాపుడు తన కత్తితో తన గుండెను చీల్చుకుని పడిపోయాడు.

తిరిగి అతనికి స్పృహ తెలిసేసరికి ప్రభాత తూర్యనాదాలు వినిపించాయి. అతను కళ్ళు తెరిచి, తాను తన శయనా గారంలోనే ఉండటమూ, రాజ్యరమ పక్కనే కూర్చుని, చల్లగా తన నుదురు నిమురుతూండటమూ కనిపించింది. అతని శయ్యా చుట్టూ బంగారు తామరులు ధగ ధగా మెరుస్తున్నాయి.

"ఇదంతా కలా? నిజమా?" అన్నాడు కీర్తిప్రతాపుడు.

"కలలో నిజం," అన్నది రాజ్యరమ.

అటు తరవాత కీర్తిప్రతాపుడు రాజ్య రమతో సుఖసంతోషాలతో మునిగితేలుతూ, బంగారు తామరలతో ప్రజల కే లోటూ లేకుండా పాలించాడు.

కరాళకంఠి కూడా తన గయ్యాళి బుద్ధి మాని, తన భర్త కళిందకుడితో అను కూలంగా ఉంటూ ఎంతో కాలం సుఖ జీవనం గడిపింది.





# చిలుక జోస్యం

ఒక ఊళ్ళో పున్నయ్య అనే బీద కాపు ఉండేవాడు. అతను బొత్తిగా మందమతి, ఏ పనీ సరిగా చేయలేక పోయేవాడు. పెరిగి పెద్దవాడయే దాకా తల్లిదండ్రుల చేత, "చేతగాని చవట! అదృష్టహీనుడు," అని తిట్లు తిన్నాడు. పెద్దవాడయాక పెళ్ళి చేసుకుని, పెళ్ళాం చేత కూడా అదే మాటలు పడ్డాడు. అసలే దరిద్రమూ, అందులో భార్య చేత మాటలు పడటమూ సహించలేక పున్నయ్య ఒకనాడు ఇల్లు విడిచి దేశాల మీద బయలుదేరాడు.

ఊరి బయటనే ఒక చెట్టు కింద చిలుక జోస్యు డొకడు పున్నయ్యకు కనిపించాడు. యజమాని పంజరం తలుపు తెరవగానే అందులో ఉండే చిలుక బయటికి వచ్చి, పెట్టెలో అడ్డంగా పేర్చి ఉండే చీటీలలో ఒకటి తీసి తన యజమాని కిస్తుంది. దాన్ని చిలుక యజమాని చదివి వినిపిస్తాడు. అతని చుట్టూ కొందరు చేరి, తల కొక బేడా చొప్పున ఇచ్చి జోస్యం చెప్పించుకుంటు న్నారు. పున్నయ్య కూడా చిలుక జోస్యుడి చేతిలో ఒక బేడా పెట్టి జోస్యం చెప్ప మన్నాడు. చిలుక ఒక చీటీ తీసి ఇచ్చింది. జోస్యుడు దాన్ని చూసి ఇలా చదివాడు:

"నిన్ను దేవుడు కన్ను తెరిచి చూశాడు. ఇవాళ నుంచీ నీకు మంచి అదృష్టం. అదృష్టం పట్టింది కనక నే నీవీ మాట వింటున్నావు."

పాపం, మందమతి అయిన పున్నయ్యకు ఆ మాటలు తలకెక్కక, "అదృష్టం పట్టిం దన్నావు, బాగానేఉంది. అందుకు నేనేం చెయ్యాలి?" అని చిలుక జోస్యుణ్ణి అడి గాడు. ఉన్న బేడా కాస్తా పోవటం మటుకే పున్నయ్యకు అర్థమయింది.

"ఏం చెయ్యాలా? ఏదైనా చెయ్య వయ్యా, నీ కడ్డుండదు. ఎవడి మొహమైనా

వి. కేశవరావు



పగలదన్ను, ఎవడి నడ్డి అయినా విరగదన్ను, ఎవరినన్నా జుట్టు పట్టుకుని జరజరా ఈడ్చెయ్యి, నీ కేమీ నష్టం రాదు, మంచే జరుగుతుంది, నీకు కలిసి వస్తుంది. అంత దాకా ఎందుకు? నీ కాళ్ళ ముందున్న లంకెబిందెలను చాచి తన్నినా నీకు లాభమే అవుతుందిపో! నా చిలుకజోస్యం ఎన్నటికీ తప్పదు. దానికి తిరుగులేదు," అన్నాడు చిలుకజోస్యుడు.

ఈ మాటలు పున్నయ్య తలకెక్కాయి. అతను ముందుకుసాగి, కొద్ది సేపట్లో ఒక చెరువుగట్టు మీదికి వచ్చాడు. చెరువుగట్టు మీద ఎవరో తండ్రికొడుకులు కూర్చుని ఉన్నారు. తండ్రి దుర్భరమైన పంటి పోటుతో బాధపడుతూ, "అమ్మా, అబ్బా!" అని మూలుగుతున్నాడు.

పున్నయ్య ఆ మనిషిని చూడగానే పిడికిలి బిగించి మూతి మీద బలంకొద్దీ కొట్టాడు. ఎవడో, ముక్కూ ముఖమూ తెలియనివాడు వచ్చి అకారణంగా తన తండ్రిని అలా కొట్టేసరికి కొడుక్కు ఎక్కడలేని ఆగ్రహమూ వచ్చింది. ఆ దెబ్బకు తండ్రి నోట నెత్తురు చిమ్మేసరికి ఆ కొడుకు పులి లాగా పున్నయ్య మీదికి లంఘించి, "తప్పుడు ముండాకొడకా, మా నాన్నను కొడతావుట్రా?" అంటూ రెండు చేతులతో పీక పట్టుకున్నాడు.

"అదృష్టం కలిసిరావాలి!" అని పున్నయ్య అరిచాడు.

తండ్రి కొడుకును వారిస్తూ, "ఆ మనిషినేమీ చెయ్యకురా! దెబ్బతో సలిపే పళ్ళు రెండూ రాలిపోయాయి. బాధంతా పోయింది. ఆ మనిషి ఎవరో మంచి ఉపకారం చేశాడు," అన్నాడు.

ఈ మాట విని కొడుకు ఆశ్చర్యంతో పున్నయ్యను వదిలిపెట్టాడు.

"దేవుడల్లే వచ్చావు బాబూ, ఇంద, ఈ డబ్బు తీసుకో," అంటూ పళ్ళూడిన

వాడు పున్నయ్య్య చేతిలో రెండు రూపా యలు పెట్టాడు.

చిలుక జోస్యంలో నమ్మకం కుదిరి పున్నయ్య్య ముందుకు సాగాడు. కొంత దూరం వెళ్ళే సరికి అతని కొక మనిషి విచిత్రమైన భంగిమలో కనిపించాడు. ఆ మనిషి నడ్డినొప్పితో మెలితిరిగి చాలా బాధలో ఉన్నాడు. ఆ మనిషి ముఖం అవతలిపక్క తిరిగి ఉన్నది.

పున్నయ్య్య వెనక నుంచి ఆ మనిషిని సమీపించి, చిలుక జోస్యుడు చెప్పిన ప్రకారం, కాలు చాచి ఆ మనిషి నడ్డి మీద బలం కొద్దీ తన్నాడు.

ఆ తాపుకు ఆ మనిషి అంతెత్తు ఎగిరిపడి, "ఎవడ్రా నువ్వూ?" అంటూ భీకరంగా పున్నయ్య్య మీదికి వచ్చాడు.

పున్నయ్య్య భయపడి, "అదృష్టం కలిసి రావాలి!" అని గావుకేక పెట్టాడు. అతన్ని చావగొట్టటానికి చెయ్యి ఎత్తిన ఆ మనిషి ముఖాన కోపం పోయి, ఆశ్చర్యం వచ్చింది. తన నడ్డినొప్పి కాస్తా తీసేసినట్టు పోయిందని అతను తెలుసుకున్నాడు.

"అయ్యా, ఈ నడ్డి నొప్పితో యమ యాతన పడుతున్నాను. ఎన్ని మందులకూ లొంగలేదు. నీ తన్నుతో పోయింది. చూడు, నిటారుగా నిలబడ గలిగాను. నిన్ను నిజంగా





దేవుడే పంపాడు. ఇదుగో, ఈ పదిరూపా యలూ ఉంచుకో," అంటూ ఆ మనిషి పున్నయ్యకు డబ్బిచ్చాడు.

పున్నయ్య మరింత ఉత్సాహంతో ఇంకా ముందుకు వెళ్ళాడు. ఒక ఇంట పెళ్ళి అవుతున్నది. ఇంటి బయట చిన్న పందిరి కింద భజంత్రీలు మేళం చేస్తున్నారు. పున్నయ్య వాళ్ళను సమీపించి, సన్నాయి వాయించే వాడిని జుట్టు పట్టుకుని జర జరా ఇవతలి కీడ్చాడు. అది చూసి, రెండో సన్నాయి వాడూ, శ్రుతిపెట్టే వాడూ, డోలు వాయించే వాడూ, తాళంవేసే వాడూ, పున్నయ్య పిచ్చివా డనుకుని, తమ మని షిని రక్షించటానికి ఇవతలికి వచ్చారు. మరుక్షణం, వాళ్ళు కూర్చుని ఉండిన పందిరి కాస్తా కూలిపోయింది.

అందరూ పోగయారు. జరిగిన దంతా విని, పున్నయ్యను మహా పుణ్యాత్ముడని పొగడారు. పెళ్ళివారు వచ్చి పున్నయ్యకు ఇరవైరూపాయలు బహుమాన మిచ్చి, పెళ్ళి అయిన దాకా ఉండి మరీ వెళ్ళమని వేడుకున్నారు. చిలుకజోస్యం ఫలిస్తున్న దనుకున్నాడు పున్నయ్య.

పెళ్ళిలో నాగవల్లికి పానకపు బిందెలు తెచ్చారు. పున్నయ్య లోపలికి వెళుతూ తన కాలికి సమీపంలో పానకం ఉన్న వెండి బిందెను చూశాడు. ఏదో బిందెను తన్నమని చిలుకజోస్యుడు చెప్పిన మాట జ్ఞాపకం వచ్చి, పున్నయ్య ఆ బిందెను కాలితో ఒక్క తన్ను తన్నాడు. బిందె దొర్లి, బోర్లాపడి, పానక మంతా నేలపాలయింది.

అది చూసిన వాళ్ళందరికీ పున్నయ్య మీద పట్టరాని ఆగ్రహం వచ్చింది. అందరూ అతన్ని నానాతిట్లూ తిట్టసాగారు. "చూస్తా రేం? తన్ని అవతలికి గెంటక!" అని కొందరు ఉడుకురక్తం వాళ్ళు కేకేశారు.

"అదృష్టం కలిసిరావాలి," అని పున్నయ్య ఆక్రోశించాడు.

ఇంతలో ఎవరో వచ్చి బోర్లా పడిన వెండి బిందెను ఎత్తి, "అయ్యో పాముర్రా!" అని కేక పెట్టారు. అది బతికున్న పాము కాదు, చచ్చిపోయింది. అది పానకంలో ఉండి ఉండాలి.

ఇక పున్నయ్యను మెచ్చుకోని వారు లేరు. అతనికి బ్రహ్మరథం పట్టేసి, పరమ శివుడే ఆ రూపంలో వేంచేశా డన్నారు. చిన్నా, పెద్దా అతని కాళ్ళకు మొక్కారు. రెండు పక్షాలవాళ్ళూ అతనికి బట్టలు పెట్టి, బంగారం చదివించి, ఇంటి దగ్గిర ఉన్న పార్వతీదేవికి—అంటే పున్నయ్య భార్యకు పెద్ద సారె తయారుచేసి, పున్నయ్య వద్దంటున్నా వినకుండా మేనా కట్టించి, అందులో అతన్ని ఇంటికి పంపేశారు.

తన భర్త మహారాజు లాగా ఇంటికి తిరిగి రావటం చూసి అతని భార్య ఆశ్చర్యపోయింది. తన కోసం అతను తెచ్చిన జరీ చీరెలూ, పట్టు చీరెలూ, బంగారు కాసులూ అవీ చూసి ఆమె మహా మురిసిపోయి, ఇవన్నీ ఎలా సంపాదించావని అడిగింది.

పున్నయ్య తన భార్యకు జరిగినదంతా చెప్పి, "ఆ పెళ్ళి వాళ్ళు నన్ను బలవంతాన ఇంటికి పంపారు గాని, నే నప్పుడే రాక పోదును. ఇంకా ఎంత మంది ముఖాలో పగలగొట్టి ఉందును, ఎంత మంది నడ్డో



విరగతన్ని ఉందును, ఎంత మందినో పిలక పట్టుకుని ఈడ్చి ఉందును, ఎన్ని బిందెలో. తన్నేసి ఉందును," అన్నాడు ధీమాగా.

అదృష్టం కలిసి వచ్చినా మొగుడికి తెలివితేటలు పెరగలేదని గ్రహించి పున్నయ్య భార్య, "ఈ కలిసివచ్చిన అదృష్టం చాల్లే. ఇంటి పట్టున పడి ఉండు," అన్నది.

అయినా పున్నయ్యకు చిలుకజోస్యం మీది గురి ఏ మాత్రమూ చెడలేదు. అందు చేత అతను భార్యతో చెప్పకుండా మరొక సారి ఇల్లు విడిచి బయలుదేరాడు. చీకటి పడే వేళకు ఒక చిన్న గ్రామం వచ్చింది. ఆ రాత్రి అక్కడ సత్రంలో ఒక స్వాముల వారు తన భక్తులకు తత్వబోధ చేస్తున్నాడు. పున్నయ్య అక్కడికి చేరుకున్నాక, ఆ స్వాములవారి ముఖం పగలగొట్టా లనిపించింది. అతను జనం మధ్యగా స్వాముల వారిని సమీపించి, ఆయన ముఖం మీద బలంగా గుద్దాడు. స్వాములవారి నోటి నుంచి రక్తం కారింది. చుట్టూ కూర్చుని ఉన్న వాళ్ళు పున్నయ్యను పట్టుకుని సున్నంలోకి ఎముక మిగలకుండా చితక తన్నారు. "అదృష్టం కలిసిరావాలి," అని పున్నయ్య ఎంతమొత్తుకున్నా లాభం లేకపోయింది.

"మూఢుడు, వాణ్ణెందుకు హింసిస్తారు? వదిలిపెట్టండి," అని స్వాములవారు తన భక్తులను నివారించకపోతే ఆ రోజు పున్నయ్య ప్రాణాలు దక్కేవికావు.

చావు తప్పి కన్ను లొట్టపోయి పున్నయ్య చిలుకజోస్యుణ్ణి తిట్టుకుంటూ ఇంటికి చేరుకుని, తన భార్యతో జరిగినదంతా చెప్పాడు.

"నేను వెళ్ళవద్దంటే విన్నావా? అదృష్టం ఎప్పుడూ కలిసి వస్తుందా? వచ్చిన అదృష్టాన్ని దక్కించుకోవాలి గాని!" అన్నది పున్నయ్య భార్య. అటుతరవాత పున్నయ్య తన భార్య చెప్పినట్టే నడుచుకుంటూ సుఖంగా జీవించాడు.





# సముద్రరాణి బానిసలు

## 2

మర్నాడు రాజకుమారుడు వనరాణి వద్దకు బయలుదేర బోతూండగా అతని స్నేహితు రాలు వచ్చింది. అత నామెతో, "శుభవార్త! మన పెళ్ళికి సామగ్రి తీసుకురావటానికి వనరాణి దగ్గిరికి పోతున్నాను," అన్నాడు.

"అంత పనీ అవుతుందని భయపడే నిన్ను వెతుక్కుంటూ వచ్చాను. ఆ వన రాణి ఎలాటి దనుకున్నావు? ఈ సముద్ర రాణి కన్న నాలుగాకు లెక్కువ చదివినది. ఆమె వద్దకు వెళ్ళి నువ్వు ప్రాణాలతో తిరిగి వస్తే చాలా అదృష్టవంతుడి వన్నమాట! నేను చెప్పేది చాలా శ్రద్ధగా విను. ఇందులో ఏది మరిచిపోయినా మనం మళ్ళీ ఒకరి నొకరం చూసుకోం. అందుచేత బాగా విను. నేను నీకు రెండు చాకులూ, రెండు ఉక్కు గొడ్డళ్ళూ, రెండు రొట్టెలూ ఇస్తాను. వన రాణి వద్దకు వెళ్ళే దారిలో వాటన్నిటినీ అవసర మున్న వాళ్ళకు ఇచ్చెయ్యి. వనరాణిని చేరుకున్నాక జ్ఞాపకం ఉంచుకోవలిసిన విషయాలు చెబుతాను. ఈ దిండు వన రాణి పెంపుడు పాముకు పెట్టు. ఆ పాము వనరాణి ఇంటి చావడిలో నేల మీద చుట్ట చుట్టుకుని పడుకుని ఉంటుంది. ఆ చావడి లోనే రంగురంగుల కుర్చీ లుంటాయి. అవన్నీ కదిపే కుర్చీలు. ఎర్ర కుర్చీ మీద కూర్చున్నావంటే ఎర్రని మంటలు లేచి నిన్ను బూడిద చేస్తాయి. తెల్లని కుర్చీ మీద కూర్చుంటే నీటి ప్రవాహం వచ్చి నిన్ను ముంచేస్తుంది. నీలం కుర్చీ మీద కూర్చుంటే నీ రక్తనాళాలు ఉబ్బి ప్రాణం పోతుంది. పసుపుపచ్చ కుర్చీ మీద కూర్చుంటే నీ రక్త మంతా విరిగిపోయి, పాండురోగంతో చచ్చి పోతావు. కాని ఆ చావడిలోనే ఒక పక్కగా కదలని నల్లకుర్చీ ఒకటి ఉంటుంది. దాని

సి. మాధవరావు



మీద నువు కూర్చోవచ్చు; ఏ అపాయమూ ఉండదు. ఇంకొక్క సంగతి: వనరాణి ఏమిచ్చినా పొరపాటున కూడా తినకు, తింటే నీ ప్రాణం దక్కదు. నేను చెప్పిన విషయాలన్నీ శ్రద్ధగా గుర్తుంచుకో," అన్నది రాజకుమార్తె.

"జ్ఞాపకం పెట్టుకునే విషయాలు చాలా ఉన్నాయి. అయినా ప్రయత్నిస్తాను," అని చెప్పి రాజకుమారుడు వనరాణి వద్దకు బయలుదేరాడు. అతను సముద్ర మార్గాన తీరం చేరి అరణ్యం ప్రవేశించి నడవ సాగాడు. అతనలా కొంత దూరం వెళ్ళేసరికి కొయ్యచెక్కడం పని చేస్తూ యిద్దరు కనిపించారు. వాళ్ళు చెక్కటానికి కొయ్యచాకులు ఉపయోగిస్తూండటం చేత ఎంత శ్రమపడినా ఫలితం స్వల్పంగా ఉంటున్నది. రాజకుమార్తె ఇచ్చిన చాకులు వాళ్ళకు బాగా ఉపయోగపడతాయి గనక రాజకుమారుడు వాళ్ళకు చెరొక చాకూ ఇచ్చాడు. ఆ చాకులతో చెక్కడం పని తేలికగా సాగడం చేత వాళ్ళు పరమానందంచెందారు.

మరి కొంత దూరం పోయాక ఇద్దరు కట్టెలుకొట్టే వాళ్ళు ఒక పెద్ద మానును కొయ్య గొడ్డళ్ళతో కొట్టడానికి ప్రయత్నిస్తున్నారు. రాజకుమారుడు వాళ్ళకు ఉక్కు గొడ్డళ్ళిచ్చాడు. వాటితో మాను బాగా తెగటం చూసి వాళ్ళు చాలా సంతోషించారు.

ఇంకొంత దూరం పోయాక అతనికి అరణ్యం మధ్యన ఒక ఇల్లు కనిపించింది. దాని వాకిట ఉన్న తోడేలూ, ఎలుగుబంటీ అతని మీదికి దూకుతూ వచ్చాయి. అతనొక రొట్టె విరిచి రెండు చేసి, రెంటికీ చెరొక ముక్కా వేశాడు. అవి ఆ రొట్టెముక్కలు నోట గరుచుకుని తమ స్థానాలకు వెళ్ళిపోయాయి. తరవాత అతను వనరాణి ఇంట ధైర్యంగా ప్రవేశించాడు.

లోపల ఒక సింహాసనం మీద కూర్చుని ఉన్న వనరాణి అతను వచ్చిన పని విని,

"మా చెల్లెలు పంపిందా? చాలా దూరం నుంచి వచ్చి అలిసిపోయావు, హాయిగా కూర్చో," అంటూ రంగుల కుర్చీలు చూపింది. అతను వాటి మీద కూర్చోక మూలగా ఉన్న నల్లకుర్చీని కనిపెట్టి, దాని మీద వెళ్ళి కూర్చున్నాడు.

వనరాణి ముఖం మాడిపోయింది. "నీకు కొంచెం ఫలహారం తెస్తాను," అంటూ ఆమె లోపలికి వెళ్ళింది. ఆ సమయంలో అతను, పాము చుట్టచుట్టుకుని ఎక్కడ పడుకున్నదీ గమనించి దాన్ని సమీపించాడు. అది తల ఎత్తి బుస్సు మన్నది. అతను దాని తల కింద దిండు పెట్టాడు. వెంటనే పాము దిండు మీద తల ఆనించి నిద్రపోయింది.

ఇంతలో వనరాణి పళ్ళెంలో ఒక లడ్డూ తెచ్చి అతని ముందుంచి, "తింటూ ఉండు నాయనా, ఈ లోపుగా నువు తీసుకుపోయే సామగ్రి సిద్ధం చేస్తాను," అని లోపలికి వెళ్ళిపోతూ, "పామూ, పామూ, జాగ్రత్త! అతిథిని బాగా చూస్తూ ఉండు," అన్నది.

ఆమె లోపలికి వెళ్ళగానే రాజకుమారుడు లడ్డూను తీసి జేబులో వేసుకున్నాడు. కొంతసేపటికి వనరాణి పెళ్ళి సామానంతా



మూటకట్టి తెస్తూ, "పామూ, పామూ, చూశావా? బాగా అతిథిని చూశావా?" అన్నది. పాము జవాబివ్వలేదు. అది చిన్న దిండు మీద తలపెట్టుకుని నిద్రలో ఉండటం చూసి వనరాణి ముఖం నల్లబడింది. ఆమె రాజకుమారుడి ముందు ఖాళీ పళ్ళెం ఉండటం చూసే సరికి ముఖం కాస్త వికసించింది.

"లడ్డూ బాగా ఉందా? ఇదుగో నీ పెళ్ళి సామాను. సుఖంగా వెళ్ళిరా, నాయనా," అన్నదామె.

అతను ఇంటిగుమ్మం దాటి ఆవరణ లోకి అడుగుపెట్టాడో లేదో, అతని జేబులో



ఉన్న లడ్డూ పెరగటం మొదలుపెట్టి గుమ్మడికాయంతై, చివరకు పెద్దగా పేలింది. దాన్ని తిని ఉన్నట్టయితే తన గతి ఏమయేదో రాజకుమారుడు తెలుసుకోగలిగాడు.

అయితే ఇప్పుడు వనరాణికి కుర్రాడు తప్పించుకు పోతున్నాడని తెలిసి, "ఓ తోడేలూ, ఓ భల్లూకం! పట్టండి వాణ్ణి! నోటపెట్టండి వాణ్ణి!" అని కేకేసింది.

తోడేలూ, ఎలుగుబంటీ నోళ్ళు తెరుచుకుని అతని పైకి వచ్చాయి. అతను తన వద్ద ఉన్న రెండో రొట్టెను తుంపి చెరి సగమూ వాటికి వేశాడు. అవి ఎప్పటి స్థానాలకు వెళ్ళిపోయి రొట్టె తినటంలో నిమగ్నమయాయి. రాజకుమారుడు ముందుకు పొయ్యాడు.

వనరాణి మళ్ళీ కేకపెట్టింది: "చెట్టు కొట్టేవాళ్ళల్లారా, చేరవచ్చే వాణ్ణి చీల్చి పారెయ్యండి!"

చెట్టుకొట్టేవాళ్ళు తలలెత్తి చూశారు. తమకు ఉక్కు గొడ్డళ్ళిచ్చినవాణ్ణి గుర్తించి, అతని దారిన అతన్ని పోనిచ్చారు.

వనరాణి ఇంకా గట్టిగా కేకపెట్టింది: "చెక్కడం పనివాళ్ళలారా, చేరవచ్చేవాణ్ణి చెక్కి చెండాడండి!"

చెక్కడం పనివాళ్ళు తల ఎత్తి చూసి, తమకు చాకులిచ్చినవాణ్ణి గుర్తించి, అతని దారిన అతన్ని వెళ్ళనిచ్చారు.

అతను తన అక్క వద్దకు వెళ్ళి కూడా క్షేమంగా తిరిగివచ్చినందుకు సముద్రరాణి ముఖం మాడిపోయింది. ఆమె ఎలాగో తననుతాను నిగ్రహించుకుని, "క్షేమంగా వచ్చావా? నిజంగా ఎంత తెలివైనవాడివి! నీ పెళ్ళి ప్రయత్నాలు బ్రహ్మాండంగా చేద్దాం," అన్నది.

రాజకుమారుడా మాటలకు పొంగిపోయాడు. అయితే రాజకుమార్తె ఆ రాత్రి అతని వద్దకు వచ్చి, "రాణి నిప్పులు తొక్కిన కోతిలాగున్నది. మనం ఈ రాత్రి

తప్పించుకు పారిపోకపోతే మన ప్రాణాలు దక్కవు," అన్నది.

"అది సులభమా?" అన్నాడతను.

"కష్టమైనా తప్పదు. నువ్వు గుర్రపు సాలకు వెళ్ళి, అక్కడుండే రెండు నల్ల గుర్రాలలో మగదానికి బంగారు జీనూ, ఆడదానికి వెండి జీనూ తగిలించి ఉంచు. రాత్రి పొద్దుపోయి సముద్రరాణి నిద్ర పోయాక బయలు దేరుదాం. ఈ లోపుగా నేను చెయ్యవలిసిన ఏర్పాట్లు కూడా ఉన్నాయి," అన్నది రాజకుమార్తె.

ఆమె తన పడకగదికి వెళ్ళింది. అది రాణి పడకగదికి అనుకునే ఉంటుంది. రాజకుమార్తె రాణికి ప్రధాన దాసి. అందు చేత రాత్రివేళ రాణి ఎప్పుడు పిలిచినా పలకటానికి వీలుగా ఇద్దరి పడకగదులూ పక్కపక్కనే ఉండేవి. ఆమె తన గదిలో ఒక గుడ్డను మూడు పేలికలుగా చేసి, మూడు ముళ్ళువేసి, ఒకదాన్ని మంచం దగ్గిరా, రెండోదాన్ని గది మధ్యా, మూడో దాన్ని ద్వారం మీదా పెట్టి, "రాణి పిలిస్తే నా బదులు పలకండి," అని చెప్పింది.

తరవాత రాజకుమారుడు మగగుర్రం మీదా, రాజకుమార్తె ఆడగుర్రం మీదా ఎక్కి శరవేగంతో గుర్రపుసాల నుంచి బయలుదేరారు.





ఒక రాత్రివేళ రాణికి మెలకువ వచ్చి, "పిల్లా, నిద్రపోతున్నావా?" అని అడిగింది.

"లేదమ్మా, పక్క చుట్టుతున్నాను," అన్నది మొదటి ముడి. రాణి రెండో పక్కకు ఒత్తిగిలి మళ్ళీ నిద్రపోయింది. మరొక గంట అయాక ఆమెకు మెలకువ వచ్చి, "పిల్లా, ఏం చేస్తున్నావు?" అని అడిగింది.

"అమ్మా, గది ఊడుస్తున్నాను," అన్నది రెండో ముడి.

మరొక గంటకు రాణి మళ్ళీ మేలుకుని, "పిల్లా, గది ఊడవటం అయిందా?" అని అడిగింది.



"గది ఊడ్చేపని యిప్పుడే అయింద మ్మా. నిప్పు రాజెయ్యబోతున్నాను," అన్నది మూడో ముడి.

ఇంకో గంట అవతల రాణి మళ్ళీ మేలుకుని, "పాయి బాగా మండుతున్నదా, పిల్లా?" అని అడిగింది.

జవాబు లేదు.

"పిల్లా, ఏం చేస్తున్నావు? పలకవేం?" అన్నది రాణి గట్టిగా.

దానికి జవాబు లేదు.

రాణికి అనుమానం తగిలి, లేచి రాజ కుమార్తె గదిలోకి వచ్చి మూడు ముళ్ళూ చూసి, "తెలివి గల ముండ! నా విద్య లన్నీ పట్టేసింది! అది ఆ రాజకుమారుణ్ణి మాటుకు పెళ్ళాడటానికి వీల్లేదు—నేను పడనివ్వను," అనుకుంటూ గుర్రపుసాలకు వెళ్ళింది. ఆమె భయపడినంతా అయింది. అతివేగంగా పరిగెత్త గల రెండు నల్ల గుర్రాలూ అక్కడ లేవు.

ఆమె కాసాకుర్రాణ్ణి పిలిచి, "ఒరే, వెంటనే నా పొటేలు మీద ఎక్కి వెళ్ళి, దారిలో ఏ ప్రాణి దొరికినా పట్టుకురా," అన్నది. రాణిని మోసే పొటేలు వాయు వేగం గలది. కాసా కుర్రాడు దాని మీద ఎక్కి బయలుదేరాడు.

అప్పటికే రాజకుమారుడూ, రాజకుమార్తె చాలా దూరం వెళ్ళారు, కాని వెళ్ళవలసిన దూరం ఇంకా ఉంది.

"ఆ హెూరు విన్నావా? అది రాణి ఎక్కే పాటేలు మోత!" అంటూ రాజకుమార్తె తమ గుర్రాలను రెండు పొదల కింద మార్చి, తమను చిట్టెలుకలుగా మార్చేసింది. కాసాకుర్రాడు త్వరలోనే అక్కడికి వచ్చి, "ఛీ, ఎలుకలా?" అనుకుని తిరిగి వెళ్ళిపోయాడు. వాడు రాణి వద్దకు వెళ్ళి, "అమ్మగారూ, ఒకచోట పొదల్లో రెండు చిట్టెలుకలు ఆడుకుంటున్నాయి. వాటిని తెమ్మంటారా?" అని అడిగాడు.

"ఆ మాట అడగటానికా వచ్చావు? ఏ ప్రాణి కనిపించినా తెమ్మంటినిగా? బయలుదేరు వెంటనే!" అన్నది రాణి.

ఈసారి వాడు పాటేలు మీద చేరవచ్చే సరికి రాజకుమార్తె తమ గుర్రాలను రెండు చెట్లుగా మార్చి తమను చిన్న పిట్టలుగా మార్చేసింది. కాసాకుర్రాడు వచ్చి చూసి, "ఓస్, పిట్టలేనా?" అనుకుని తిరిగివెళ్ళి, "అమ్మగారూ, ఈసారి ఎలుకలు లేవుగాని, పిట్టలు కనిపించాయి. పట్టుకు రమ్మని సెలవా?" అన్నాడు.

ఈ పని వాడివల్ల కాదని రాణి తెలుసుకున్నది. ఈసారి ఆమె తానే పాటేలు నెక్కి బయలుదేరింది. ఆమె తన బానిసలను చేరుకుని, పట్టుకునే లోపుగా వాళ్ళిద్దరూ సముద్రం నుంచి బయటికి వచ్చి ఒడ్డు చేరుకున్నారు. నీటి సరిహద్దు దాటితే రాణికి ప్రభావం లేదు. అందుచేత ఆమె వెనక్కు వెళ్ళిపోవలసి వచ్చింది.

రాజకుమారుడు తీరం వెంబడి కొద్ది దూరం నడిచి తమ ఇంటిని చేరుకున్నాడు. అతను తన తల్లిదండ్రులకు రాజకుమార్తెను పరిచయం చేసి, ఆమె తన ప్రాణాలను ఎన్నిసార్లు ఎలా ఎలా కాపాడిందీ చెప్పాడు. రాజు వాళ్ళిద్దరికీ వైభవంగా పెళ్ళి చేసేశాడు.





# తెలివిగల గూఢచారి

ఒకప్పుడు చంపాపుర రాజుకూ, నీలగిరి రాజుకూ మధ్య వైరం వచ్చి, ఉభయ దేశాల మధ్యా యుద్ధం కలిగే పరిస్థితి ఏర్పడింది. నీలగిరి రాజు యుద్ధ యత్నాలు చేస్తున్నట్టు వేగులవాళ్ళ ద్వారా తెలుసుకుని చంపాపుర రాజు తాను కూడా యుద్ధ యత్నాలు చేస్తూ, శత్రు గూఢచారులు తన రాజ్యంలో సంచరించ కుండా తన గూఢచారులను నియోగించాడు.

అలాటి గూఢచారులలో ఒకడు కూలి వాడి వేషంలో బయలుదేరి రాజబాట వెంట నగరం దాటి చాలా దూరం వెళ్ళాడు. కొంతసేపటికి వాడి చెప్పు తెగిపోయింది. ఇప్పుడేమి చేయటమా అని వాడు అటూ యిటూ చూచేంతలో, అదృష్టవశాన దగ్గిరలోనే ఒక చెట్టు కింద చెప్పులు కుట్టేవాడొకడు కనిపించాడు. గూఢచారి తన తెగిన చెప్పును వాడి కిచ్చి, "అవసరం అయిన పని మీద పోతున్నాను. త్వరగా చెప్పుకుట్టి యివ్వు," అన్నాడు.

చెప్పులు కుట్టేవాడు గూఢచారి చెప్పును బాగుచేస్తుండగా దారిన పోయేవా డొకడు చూసి, ఆగి, "ఏం తాతా? ఇక్కడ ముళ్ళకు కంచెలు కడుతున్నావా? కాళ్ళకు కాలం తీరిన జాడ లేమైనా తెలిశాయా?" అని అడిగాడు.

"తెలియకేం? మూడు జాముల కింద రెండు కాళ్ళతో ముగ్గురు వెళ్ళారు. సూర్యుడు పీల్చేది పీల్చి ముగ్గురూ చచ్చారు. మూడేళ్ళ కింద చచ్చినవాడు ముగ్గుర్నీ కాల్చాడు," అన్నాడు చెప్పులు కుట్టేవాడు పెద్దగా నవ్వుతూ.

"అంతే శక్తి చాలు నన్నుమాటే!" అన్నాడు దారే పొయ్యేవాడు.

"కొల్ల! రేపు దొరికే కాళ్ళ కోసం సముద్రం బిడ్డ ఎదురు చూస్తున్నారు.

ఎల్. రామనాథం

భూమి కడుపు నిండుతుందిలే," అన్నాడు చెప్పులు కుట్టేవాడు.

దారే పొయ్యేవాడు వెళ్ళబోతూండగా గూఢచారి కత్తి దూసి వాణ్ణి నిలవేసి పెడ రెక్కలు విరిచికట్టాడు.

చెప్పులుకుట్టేవాడు విరగబడి నవ్వుతూ గూఢచారితో, "వాడో పిచ్చివాడు! అర్థం లేని వాగుడు వాగుతాడు! వాణ్ణి పట్టుకున్నా వేమిటి?" అన్నాడు.

మరుక్షణం గూఢచారి చెప్పులుకుట్టే వాడి మీదపడి, వాణ్ణి కూడా పెడరెక్కలు విరిచికట్టి, ఇద్దరినీ రాజసభకు లాక్కుపోయి, "మహారాజా, వీళ్ళిద్దరూ శత్రు గూఢచారులు. మహాతెలివైన ఘటాల్లా కని పిస్తున్నారు. వీళ్ళను విచారించి తగిన విధంగా శిక్షించండి," అన్నాడు.

అయితే చెప్పులుకుట్టేవాడు గాని, వాడితో మాట్లాడిన వాడు గాని తాము శత్రు గూఢచారులమని ఒప్పుకోలేదు. తా మేదో వేళా కోళపు మాటలాడుకుంటే మారు వేషంలో ఉన్నవాడు అనుమానించి తమని పట్టు కొచ్చాడని వాళ్ళన్నారు. మీ రాడుకున్న మాట లేమిటని మంత్రి అడిగితే అవి తమకు జ్ఞాపకం కూడా లేవని ఇద్దరూ అమాయికపుముఖాలు పెట్టారు.



అప్పుడు మంత్రి గూఢచారి నడిగాడు. గూఢచారి ఒక్క అక్షరం పొల్లుపోకుండా వాళ్ళ సంభాషణ అంతా చెప్పాడు. అది విని మంత్రి నిర్ఘాంతపోయి, తరవాత రాజుతో, "మహారాజా, వీడు గొప్ప మేధావి. కనకనే ఇలాటి ప్రమాదకరమైన శత్రు గూఢచారులను పట్టుకో గలిగాడు. మన గూఢచారికి మంచి బహుమానం ఇచ్చి, ఈ ఇద్దరి తలలూ వెంటనే తీయించండి," అన్నాడు.

"వీళ్ళ మాటల వల్ల వాళ్ళు అంత ప్రమాదమైన వాళ్ళని నాకు తోచలేదే!" అన్నాడు రాజు.

"ఇంకేం ప్రమాదం కావాలి, మహా రాజా? రేపు మన సైన్యాలు నడిచే దారి వెంట చెరువులలో వీళ్ళు విషం కలిపారు. ఆ నీరు తాగి ఒక గర్భిణీస్త్రీ, ఒక బిడ్డా చచ్చారు. రేపు మన సైనికులు కూడా ఆ నీరు తాగి చస్తారని వీళ్ళ అంచనా!" అన్నాడు మంత్రి.

"చాలా ఆశ్చర్యంగావుంది. కొంచెం వివరించి చెప్పండి. అదంతా వాళ్ళ మాటలలో ఉన్నదా?" అని రాజడిగాడు.

"లేకపోవట మేమిటి? ముళ్ళకు కంచెలు కట్టట మంటే చెప్పులు కుట్టటం. చెప్పులు కుట్టేవాణ్ణి రెండోవాడు గుర్తించి, ఇక్కడ చెప్పులు కుట్టుతున్నావా అని అడిగాడు. వాడి అసలు వృత్తి చెప్పులుకుట్టటం కాదన్నమాట. కాళ్ళకు కాలం తీరటమంటే మనుషులు చావటమన్నమాట. ఎవరైనా చచ్చినట్టు తెలిసిందా అని ఒక గూఢచారి ప్రశ్న. రెండుకాళ్ళ మీద ముగ్గురు వచ్చారంటే ఒక గర్భిణీస్త్రీ ఒక బిడ్డను ఎత్తుకుని అటుగా వచ్చిం దన్నమాట. సూర్యుడు పీల్చేది, అంటే నీరు, పీల్చి ముగ్గురూ చచ్చారు అని చెప్పులు కుట్టేవాడు చెప్పాడు. మూడేళ్ళ క్రితం పడిపోయిన చెట్టు కట్టెలతో వారిని దహనం కూడా చేశారట. శక్తి చాలునంటే నీటిలో కలిపిన విషం చాలునన్నమాట. రేపు దొరికే కాళ్ళ కోసం సముద్రం బిడ్డ లెదురు చూస్తున్నారంటే, రేపు మన సైనికులను చంపటానికి చెరువులూ, ఇతర జలాశయాలూ సిద్ధంగా ఉన్నా యన్నమాట. అధిక సంఖ్యలో చచ్చిన సైనికులను పాతేస్తే భూమి కడుపు నిండకేం చేస్తుంది?" అని మంత్రి వివరించి చెప్పాడు.

రాజు ఆ శత్రు గూఢచారు లిద్దరికీ శిరశ్ఛేదం విధించి, వారిని పట్టిన తన గూఢచారికి మంచి బహుమానం ఇచ్చి ఉద్యోగ హెూదా కూడా పెంచాడు.





# లోభీ-వ్యాధీ

పాపన్న ఉండే గ్రామానికి ఒక ఆమడ దూరంలో ఉన్న ఊళ్ళో కనకయ్య అనే భూస్వామి ఉండేవాడు. కట్టుకుపోయినంత డబ్బుండి కూడా ఆ కనకయ్య పరమలోభి. కానీ ఖర్చు చెయ్యాలంటే ప్రాణం మీదికి వచ్చేది. అటువంటి వాడికి కాస్త గుండె నొప్పి ప్రారంభమయింది.

గుండెనొప్పి చాలా చెడ్డ జబ్బు. దానికి చికిత్స జరగకపోతే ప్రమాదం. చికిత్స చేయించాలంటే డబ్బు ఖర్చవుతుంది. అందుచేత కనకయ్య మొదట్లో అదే పోతుం దని తాత్సారం చేశాడు. ఆ నొప్పి కూడా నిలకడగా ఉండక, వస్తూ పోతూ ఉండేది. అది పోయినప్పుడు ఇక రాదనుకునేవాడు కనకయ్య. కాని అది తిరిగి వచ్చేది. అప్పుడు కనకయ్య, "ఛీ, ఈ దిక్కు మాలిన నొప్పి వైద్యం చేస్తేగాని నయ మయేటట్టు లేదు," అనుకునేవాడు.

కనకయ్య ఇంట్లో వెంక డనేవాడు పని చేస్తూండేవాడు. వెంకడు జీతానికి కుదిరిన నౌకరుకాడు, కనకయ్యకు ఋణపడి, బాకీ తీర్చలేక, పనిచేసి ఋణం చెల్లబెట్టు తున్నవాడు. కనకయ్య వెంకణ్ణి పిలిచి, "గుండె నొప్పికి వైద్యం చేసేవాళ్ళెవరన్నా ఉన్నారేమో నీకు తెలుసా?" అని అడిగాడు.

"మా పల్లెలో ఒకడికి గుండె నొప్పి వస్తుందండి. వాడు భస్మాల వైద్యుడి దగ్గిర మందు తీసుకుంటున్నాడు. ఆ భస్మాల వైద్యు డెక్కడుంటాడో కనుక్కుని చెబు తాను," అన్నాడు వెంకడు.

"మళ్ళీ కనుక్కోవటం దేనికిలే? మీ పల్లెలోవాణ్ణే అడిగి బేడాకో, పావలాకో ఆ మందే పట్టుకురా," అన్నాడు కనకయ్య. వెంకడు తనకు బాకీ ఉన్నవాడు గనక వాడి చేతిలో కనకయ్య డబ్బులు పెట్టలేదు. వెంకడు తన పల్లెలో ఉండేవాణ్ణి బతిమాలి,



వాడు తీసుకుంటున్న మందులో కొంత తెచ్చి కనకయ్యకిచ్చాడు. కనకయ్య దాన్ని పొదుపుగా కొంచెం కొంచెమే తీసుకుంటూ వచ్చాడు. కాని నొప్పి తగ్గలేదు. మందు కాస్తా అయిపోయింది. మరికొంచెం మందు పట్టుకు రమ్మని కనకయ్య వెంకణ్ణి మళ్ళీ అడిగాడు. "ఇంక అక్కడ మందు దొరకదండీ. వాడికి గుండె నొప్పి నిలిచిపోయిందిట. మందు మానేశాడు," అన్నాడు వెంకడు.

"అయితే ఆ వైద్యుడెక్కడ ఉంటాడో, ఏ విధంగా మందిస్తాడో వివరంగా తెలుసుకురా," అన్నాడు కనకయ్య. వెంకడు మర్నాడు వచ్చి వివరాలు చెప్పాడు.



భస్మ వైద్యుడుండే గ్రామం నాలుగు మైళ్ళ దూరాన ఉన్నది. అయన పేదవాళ్ల దగ్గిర వారంరోజుల మందుకు పావలా తీసుకుంటాడు, కాని కలిగినవాళ్ళ దగ్గిర రూపాయికి తక్కువ తీసుకోడు.

ఈ మాట విని కనకయ్య చాలా బాధపడ్డాడు. వారంవారం రూపాయిబిళ్ళ కుడుములాగా ఖర్చుచేసి మందు తీసుకోవాలంటే ప్రాణం పోయినంత పనవుతుంది. మందు తీసుకోకుండా ఉందామనుకుంటే గుండె నొప్పితో ప్రాణమే పోవచ్చు. ఈ చిక్కు విడక మూడు రోజులు మథన పడి కనకయ్య ఒక నిర్ణయానికి వచ్చాడు.

ఒక రోజు వేకువజామున కనకయ్య వెంకడితో, "నేను తొందర పనిమీద పొరుగూరు పోతున్నాను. నువు మాత్రం నేను తిరిగి వచ్చేదాకా ఇక్కడే ఉండు, ఎటూ పోకు," అని బయలుదేరాడు. ఆయన తిన్నగా వెంకడుండే పల్లెకు చేరుకుని, వెంకడి గుడిసెకు వెళ్లాడు. ఇంట్లో వెంకడి కొడుకులిద్దరు మాత్రమే ఉన్నారు. "మీ అమ్మ ఏదిరా?" అని అడిగితే, పొలంలో గడ్డి కోసుకు రాబోయిందన్నారు.

వెంకడి పెద్ద కొడుకు పన్నెండేళ్లవాడి చేతిలో ఒక పావలా పెట్టి కనకయ్య, "నీకు

భస్మాల వైద్యుడి ఊరూ, ఇల్లూ తెలుసా? అయితే వెంటనే వెళ్లి, మీ నాన్నకు గుండె నొప్పి వస్తున్నదని చెప్పి, ఒక వారానికి సరిపోయే మందు పట్టుకురా. వైద్యుడితో ఏం చెబుతావు?" అన్నాడు.

"మా నాన్నకు గుండె నొప్పి వస్తున్నది. ఒక వారానికి మందియ్యమని చెబుతా," అన్నాడు వెంకడి కొడుకు.

"చాలా బాధపడుతున్నాడని చెప్పు. ఏం? నువు వచ్చేదాకా నేనిక్కడే ఉంటా," అన్నాడు కనకయ్య, చౌకలో మందు దొరుకుతుందని ఉబలాటపడుతూ.

వెంకడి కొడుకు పావలా తీసుకుని వైద్యుడి గ్రామానికి పొలాల వెంట పరిగెత్తి పోతుంటే, వాడి తల్లి గడ్డి కోసు కుంటూ వాణ్ణి చూసి, "ఎక్కడికిరా?" అని అడిగింది.

"అయ్యకు గుండె నొప్పిట. చాలా బాధ పడుతున్నాట్ట. కనకయ్యగారు మనింటి కొచ్చి, ఈ పావలా డబ్బులు ఇచ్చి త్వరగా మందు తెమ్మని నన్ను పంపారు," అని చెప్పాడు కుర్రాడు.

వెంకడి భార్య కంగారుపడి, "ఇదేం గ్రహచారంరా, బాబూ! ఆ డబ్బిటియ్యి, మందు నువేం తెస్తావు? నేనే పోతా,"



అంటూ పావలా తీసుకుని, రెండుమైళ్ళ దూరంలో ఉన్న వైద్యుడి గ్రామం చేరి, వైద్యుడింటికి వెళ్లి, "బాబూ, మా అయనకు గుండెనొప్పి వచ్చి చాలా బాధపడుతున్నాడు. ఈ పావలా తీసుకుని మందిచ్చి పుణ్యం కట్టుకోండి," అన్నది.

వైద్యు డామెను ఎగాదిగా చూసి, "రోగిని యిక్కడికి తీసుకురా, చూడకుండా మందివ్వను," అన్నాడు.

రోగి అయిదారు మైళ్ళదూరాన కనకయ్య గారింట ఉన్నాడనీ, నడవలేడనీ, మందిచ్చి ప్రాణం కాపాడమనీ వెంకడిభార్య వైద్యుడి కాళ్ళావేళ్ళా పడింది.



"కనకయ్యగారంటే పేరుమోసిన భూస్వామిగదా. ఆయనింట పనిచేసేవాడికి ఆయనే గదా మందిప్పిస్తాడు. రూపాయకు తక్కువైతే మందివ్వను. అయినా రోగిని చూడాలి," అన్నాడు వైద్యుడు.

తన భర్త జీతానికున్న నౌకరు కాదనీ ఋణపడి శ్రమచేసి బాకీ తీరుస్తున్నాడనీ చెప్పి, ఆమె వైద్యుణ్ణి తనవెంట రమ్మన్నది. "నే నెలా వస్తాను? నా కోసం ఎక్కడెక్కడి నుంచో వస్తారు. ఈ పెద్దమనిషిని చూడు, రెండు కోసులదూరం నుంచి నా కోసం బండి కట్టుకుని వచ్చాడు," అన్నాడు వైద్యుడు. వైద్యుడు చెప్పిన మనిషి పాపన్నే. అతను జరిగినదంతా చూస్తూనే ఉండి, వెంకడి భార్యతో, "నా బండి మీద రామ్మా, నీ భర్తను తీసుకు వద్దాం. వైద్యుడుగారు చూసి మందిస్తారు," అన్నాడు.

పాపన్న వెంకడి భార్యను బండిలో ఎక్కించుకుని కనకయ్య ఇంటికి వచ్చాడు. వెంక డక్కడే ఉండి, భార్యను చూసి ఆశ్చర్యపడ్డాడు. భార్య కూడా, పిడిరాయి లాగున్న భర్తను చూసి, "జబ్బు నయమయిందా ఏం?" అన్నది.

"నాకేం జబ్బు?" అన్నాడు వెంకడు.

వెంకడి భార్య జరిగినదంతా చెప్పింది.

"అయ్యగారు కూడా బాగానే ఉన్నారే. పొరుగూరు వెళ్ళొస్తానని వేకువనే బయల్దేరారు. దారిలో మనవాడు కనిపిస్తే ఏదో చెప్పివుంటారు, వాడింకేదో అర్థం చేసుకుని ఉంటాడు," అన్నాడు వెంకడు.

భార్యా భర్త లిద్దరూ పాపన్నకు అనవసరంగా శ్రమ ఇచ్చినందుకు క్షమాపణ చెప్పుకున్నారు. పాపన్న బండి తోలుకుంటూ తన గ్రామానికి బయలుదేరాడు.

ఈలోపల వెంకడి గుడిసెలో వేచి ఉన్న కనకయ్య, వెంకడి కొడుకు తిరిగి రావటం చూసి, "ఏంరా, మందేది? అప్పుడే వచ్చావేం?" అన్నాడు.

"మందు మా అమ్మ తెస్తానని వెళ్ళింది," అన్నాడు కుర్రాడు.

వెంకడి భార్య ఎంతకూ రాలేదు. కనకయ్యకు గుండెనొప్పి ఆరంభమై, హెచ్చే టట్టు కనబడింది. ఆయన వెళుతున్నానని కుర్రాడికి చెప్పి, వైద్యుడి గ్రామం కేసి నడక సాగించాడు. దారిలో వెంకడి భార్య మందుతో ఎదురు వస్తుందని ఆయన ఆశ.

ఒకవేళ ఆమె రాకపోతే తాను వైద్యుడి దగ్గిరికి వెళ్ళవలిసి వస్తుంది. తనను చూసి ధనికు డనుకుని వైద్యుడు మందుకు రూపాయి అడుగుతాడు. ఈ భయంతో కనకయ్య తన చేతి ఉంగరాలూ, డబ్బు సంచీ, చొక్కా తీసి మూట గట్టి, అది పట్టుకుని, రెండో చేత్తో గుండెను అదిమి పెట్టుకుని నడుస్తూ, దారిలో ఒకచోట స్పృహతప్పి పడిపోయాడు.

బండి తోలుకుంటూ అటుగా వచ్చే పాపన్న ఆయనను చూసి, బండి ఆపి, ఆయన ముఖాన ఇన్ని నీళ్ళు చల్లి, స్పృహ తెప్పించాడు.

కళ్ళు తెరుస్తూనే కనకయ్య, "మందు తెచ్చావామ్మా?" అని అడిగాడు.

ఆ మాటలు పాపన్నకు అర్థంకాక, కనకయ్యను ఎత్తి బండిలో పెట్టి, బండిని మళ్ళీ వైద్యు డింటికి తోలుకుపోయాడు.



వైద్యుడు రోగిని పరీక్షించి, "రోగం చాలా ముదిరింది. రోజూ పరీక్ష చేస్తూ మందివ్వాలి. ఎవరీ మనిషి?" అన్నాడు.

"నాకు తెలీదండీ, ఎవరో అనాథలా గున్నాడు. మీరు చికిత్స చెయ్యండి. నేను రోజూ బండిలో తెస్తాను. మందు ఖర్చు కూడా ఇచ్చుకుంటాను," అన్నాడు పాపన్న.

కనకయ్యకు మర్నాటికి గాని పూర్తిగా స్పృహ రాలేదు. ఒళ్ళు తెలియగానే ఆయన, "మీ రెవరు? నే నెక్కడ ఉన్నాను?" అని పాపన్నను అడిగాడు.

"క్షేమమైన చోటనే ఉన్నావు. నీ కేమీ భయం లేదు. నువ్వెవరు? నీ పేరేమిటి?" అని పాపన్న అడిగాడు.

"నా పేరుతో ఏం పనిలెండి. ఎవడో దిక్కులేని వాణ్ణి. నా మూట ఏది?" అన్నాడు కనకయ్య.

"నీ మూట భద్రంగానే ఉంది. వారం రోజులపాటు కుదురుగా ఉండి మందు తీసుకుంటే ఆ తరవాత నువు స్వేచ్ఛగా నీ యిష్టం వచ్చినట్టు తిరగవచ్చు," అన్నాడు పాపన్న. కనకయ్య పారిపోతాడని అనుమానం తగిలి, అలాటి పని జరగకుండా కట్టు దిట్టాలు చేశాడు.

అక్కడ కనకయ్య కుటుంబానికి కనకయ్య ఏమైపోయిందీ తెలియరాలేదు. వాళ్ళు ఆరాలు తీయగాతీయగా చివరకు పాపన్న ఇంట్లో కనకయ్య దొరికాడు. తాను అనాథుడు కాడనీ, పెద్ద భూస్వామి అనీ పాపన్నకు తెలిసిపోయే సరికి కనకయ్యకు చచ్చే అవమానమయింది. తాను వ్యాధి తీవ్రతలో మతి చెడి ఏం మాట్లాడినదీ తనకే తెలియదని చెప్పుకుని, కనకయ్య తన మందు ఖర్చే గాక, పాపన్నకు కొంత బహుమానం కూడా ఇచ్చి, తన ఊరికి తిరిగి వెళ్ళాడు. కొన్ని వారాలపాటు వైద్యం చేయించుకున్నాక కనకయ్య గుండె నొప్పి తగ్గిపోయింది.





# ఉత్తరకాండ

కార్తవీర్యార్జునుడికి పట్టుబడి విడుదల అయి కూడా రావణుడి మదగర్వం అణగ లేదు. అతను ప్రపంచ మంతా తిరుగుతూ బలవంతులైన రాక్షసులనూ, మానవులనూ యుద్ధానికి సవాలు చేస్తూండేవాడు. ఒక సారి అతను కిష్కింధకు వెళ్ళి, వాలిని యుద్ధానికి ఆహ్వానించాడు.

వాలి మంత్రి అయిన తారుడు రావణుడితో, "రావణా, ప్రస్తుతం వాలి కిష్కింధలో లేడు. మిగిలిన వానరులు నీతో యుద్ధం చెయ్యటానికి చాలరు గదా. వాలి సంధ్యావందనం చెయ్యటానికి నాలుగు సముద్రతీరాలకూ వెళ్ళి ఉన్నాడు. ఇదుగో ఈ ఎముకల గుట్ట చూడు. ఇది వాలి చేతిలో చచ్చినవారి ఎముకల పోగు. నువు కూడా ఆ గుట్ట మీద చేరదలిస్తే కొంచెం ఆగు, వాలి త్వరలోనే తిరిగి వస్తాడు. లేక మరీ అంత తొందరలో ఉన్నట్టయితే, దక్షిణ సముద్ర తీరానికి వెళ్ళి, అక్కడే వాలి చేతిలో శీఘ్రంగా చచ్చిపోవచ్చు," అన్నాడు.

రావణుడు తారుణ్ణి తిట్టి, పుష్పకం మీద దక్షిణ సముద్ర తీరానికి వెళ్ళాడు. అక్కడ అతనికి మేరుపర్వతం లాటి వాలి సంధ్య వార్చుతూ కనిపించాడు. రావణుడు కొంత దూరంలో పుష్పకం దిగి, వాలిని వెనక నుంచి పట్టుకునే ఉద్దేశంతో, అడుగుల చప్పుడు వినపడకుండా వాలిని సమీపించాడు. కాని హఠాత్తుగా వాలి వెనక్కు తిరిగి, రావణుణ్ణి చూసి, అతని ఉద్దేశం

గ్రహించి కూడా, ఏమీ ఎరగనట్టు ఉండి పోయాడు. కాని రావణుడు సమీపంలోకి వచ్చినట్టు తెలియగానే వాలి, గరుత్మంతుడు పామును పట్టినట్టుగా, రావణుణ్ణి పట్టుకుని, చంకలో పెట్టుకుని, రివ్వున ఆకాశంలోకి లేచాడు.

రావణుణ్ణి విడిపించాలని అతని మంత్రులు కేకలు పెడుతూ వాలి వెంట పడ్డారు. కాని కొంత దూరం వెళ్ళి, వాలిని అందుకోలేక, అలిసిపోయి, వారు వెనక్కు వెళ్ళిపోయారు. అదే మంచి దయింది, లేకపోతే వారు వాలికి చిక్కి ప్రాణాలతో బయటపడి ఉండేవారు కారు.

వాలి రావణుణ్ణి చంకలో పెట్టుకుని పడమటి సముద్రతీరాన దిగి, అక్కడ స్నానం చేసి, సంధ్యవార్చి, ఉత్తర సముద్రానికి వెళ్ళాడు, ఆ తరవాత తూర్పు సముద్రానికి వెళ్ళాడు. అన్ని సముద్రాల వద్దా సంధ్యానుష్ఠానాలు ముగించుకుని వాలి రావణుడితో సహా కిష్కింధకు తిరిగి వచ్చాడు. కిష్కింధలోని ఉద్యానంలో వాలి రావణుణ్ణి కిందికి దించి, నవ్వుతూ, "ఏం రావణా? ఎక్కడి నుంచి రావటం?" అని అడిగాడు.

రావణుడు వాలికి క్షమాపణ చెప్పుకుంటూ, "నీ వంటి బలశాలీ, వేగవం







తుడూ సృష్టిలో మరొకడు లేడు. నన్ను పట్టుకుని నాలుగు సముద్రాలలోనూ నువ్వొక్కడవే ముంచగలిగావు. నీ శక్తి అపూర్వం. నేను నీతో అగ్నిసాక్షికమైన స్నేహం వాంఛిస్తున్నాను," అన్నాడు.

ఆ ప్రకారమే అగ్నిని ప్రజ్వలింపజేసి, ఇద్దరూ కౌగలించుకుని, భ్రాతృస్నేహం అవలంబించారు. రావణుడు కిష్కింధలో ఒక నెలరోజు లుండి, సుగ్రీవుడు పొందే మర్యాదలన్నీ పొందాడు. తరవాత రావణుణ్ణి, అతని మంత్రులు వచ్చి లంకకు తీసుకుపోయారు.

అగస్త్యుడు రాముడికి ఈ వృత్తాంతం చెప్పి, "రామా, నీ చేతిలో ఒక్క బాణంతో చచ్చిన వాలి అలాటి అపార బలసంపన్నుడు!" అన్నాడు.

దానికి రాముడు, "అగస్త్యమహర్షీ, వాలి బలమూ, రావణుడి బలమూ అపూర్వమైనవని నేను అంగీకరిస్తాను గాని, నా ఉద్దేశంలో హనుమంతుడు వీరి కన్న కూడా శక్తిమంతుడుగా కనిపిస్తాడు. అతడు నూరుయోజనాల సముద్రాన్ని లంఘించటమే గాక, రావణుడి లంకలోని అంతఃపురంలోకి అవలీలగా ప్రవేశించి, ఎందరో రాక్షస వీరులను ఒంటరిగా చంపి, లంకా నగరాన్ని తగలబెట్టినవాడు. అతను చేసిన సాహసాలు మూడు లోకాలలోనూ ఎవరికీ సాధ్యంకా వనిపిస్తుంది. అంత మహా బలశాలి వాలిని చంప కుండా, తన రాజైన సుగ్రీవుడు అష్టకష్టాలూ పడుతూంటే ఎందుకు చూస్తూ ఊరుకున్నాడు? ఈ నా సందేహాన్ని తీర్చండి," అని కోరాడు.

అది విని అగస్త్యుడు, "రామా, హనుమంతుణ్ణి గురించి నీ వన్న దంతా నిజమే. అంతటి బలశాలీ, వేగవంతుడూ, బుద్ధిశాలీ మరొకడుండడు. అతడు అతి బాల్యంలోనే ఎన్నో అద్భుతాలు చేశాడు. బహుశా అతని కా విషయాలు జ్ఞాపకం కూడా





ఉండవు. కాని మును లతనికి బాల్యంలోనే శాపం ఇచ్చారు. అతని విచిత్ర కథ చెబు తాను," అంటూ ఇలా చెప్పాడు.

హనుమంతుడి తండ్రి కేసరి మేరు పర్వతం మీద రాజ్యం చేస్తూ ఉండేవాడు. కేసరి భార్య అంజన. ఆమె వాయుదేవుడికి హనుమంతుణ్ణి కన్నది. పసివాడైన హను మంతుణ్ణి ఆమె ఒక చోట పడుకోబెట్టి, పళ్ళు తెద్దామని అడవికి పోయింది. ఇంతలో హనుమంతుడికి ఆకలి అయి ఏడవసాగాడు. అప్పుడే తూర్పుకొండ మీద ఎర్రగా సూర్యబింబం ఉదయించింది. అదేదో పండు అనుకుని దాన్ని పట్టుకోవటా నికి ఆ శిశువు ఆకాశంలో ఎగిరి వెళ్ళ సాగాడు. సూర్యుడి కెదురుగా వెళ్ళే మరొక సూర్యుడి లాటి హనుమంతుణ్ణి చూసి, దేవ తలూ, దానవులూ, యక్షులూ దిగ్భ్రమ చెందారు. ఎందుకంటే, అప్పటికే అతని వేగం వాయు వేగాన్నీ, గరుత్మంతుడి వేగాన్నీ మించింది.

అలా సూర్యుడి కేసి ఎగురుతూ పోతున్న తన కొడుకు వెంట వాయుదేవుడు కూడా పరిగెత్తుతూ, ఆ శిశువుకు సూర్యుడి వేడి తగలకుండా మంచు బిందువులు చల్లుతూ వెళ్ళాడు. ఈ విధంగా తనను సమీపించే బాల హనుమంతుడి పైన సూర్యుడు కూడా తన ప్రతాపం చూపలేదు.

అదీగాక, హనుమంతుడు సూర్యుణ్ణి చేరుకునే సమయానికే సూర్యుణ్ణి పట్టటా నికి రాహువు కూడా సూర్యుడి రథం పైకి వచ్చాడు. రాహువును చూడగానే హనుమం తుడు సూర్యుణ్ణి వదిలేసి రాహువును పట్టుకోబోయాడు. రాహువు భయపడి పారి పోయి, నిండు సభలో ఉన్న ఇంద్రుడి వద్దకు వెళ్ళి, "ఇంద్రా, ఏమిటీ అన్యాయం? పర్వకాలం గదా అని నేను సూర్యుణ్ణి మింగబోయే సమయంలో అక్కడికి మరొక రాహువును పంపావు. వాడు సూర్యుడితో

బాటు నన్ను కూడా పట్టుకుని మింగ బోయాడు," అన్నాడు.

వెంటనే ఇంద్రుడు రాహువును వెంట బెట్టుకుని ఐరావతం మీద సూర్యుడి వద్దకు వచ్చాడు. ఇంకా అక్కడే ఉన్న హనుమంతుడు రాహువును చూడగానే పట్టుకో వచ్చాడు. "ఇంద్రా, రక్షించు, రక్షించు," అన్నాడు రాహువు.

"నేను వీణ్ణి చంపుతాను, భయపడకు," అని ఇంద్రుడు రాహువుతో అంటూండగానే హనుమంతుడు ఐరావతాన్ని చూసి, అదేదో తెల్లని పండనుకుని, దాని పైకి వచ్చాడు. ఇంద్రుడు తన చేతిలో ఉన్న వజ్రాయుధంతో మెల్లగానే హనుమంతుణ్ణి కొట్టాడు. ఆ దెబ్బకు బాల హనుమంతుడు ఒక కొండ మీద పడిపోయాడు. అతని ఎడమ దవడ నలిగిపోయింది.

తన కొడుకును కొట్టినందుకు ఇంద్రుడి పైన కోపం వచ్చి వాయుదేవుడు ప్రపంచ మంతటా సంచరించటం మాని, తన కొడుకు నెత్తుకుని ఒక కొండ గుహలో కూర్చున్నాడు. ప్రాణులన్నీ ఉక్కిరిబిక్కిరి అయిపోయాయి. గంధర్వులూ, దేవతలూ మొదలైనవారు బ్రహ్మ దగ్గిరికి వెళ్ళి మొర పెట్టుకున్నారు. బ్రహ్మ వారందరినీ వెంటబెట్టుకుని వాయుదేవు డున్న గుహకు వెళ్ళాడు.





బ్రహ్మ మొదలైన వారిని చూడగానే వాయుదేవుడు తన కొడుకు నెత్తుకుని వచ్చి, బ్రహ్మ కాళ్ళ మీద పడ్డాడు. బ్రహ్మ చేతితో నిమరగానే, ప్రాణం కడబట్టి ఉన్న హనుమంతుడు తిరిగి ఎప్పటి లాగా అయాడు. వాయుదేవుడు సంతోషించి, తిరిగి ప్రపంచ మంతటా సంచరించ సాగాడు.

వాయుదేవుణ్ణి మరింత సంతోషపెట్టే ఉద్దేశంతో బ్రహ్మ, దిక్పాలకులను హనుమంతుడికి వరా లివ్వమన్నాడు. తన మూలంగా హనువు (దవడ) దెబ్బతిన్నది గనక అతనికి హనుమంతుడని పేరు పెట్టుతూ, ఇక ఎన్నటికీ అతనికి వజ్రా



యుధం చేత దెబ్బతగల కుండా ఇంద్రుడు వర మిచ్చాడు. సూర్యుడు హనుమంతుడికి తన తేజస్సులో ఒక శాతం ఇచ్చాడు; హనుమంతుడు గొప్ప వక్తా, మహాపండితుడూ అయేటట్టు వరం కూడా ఇచ్చాడు. హనుమంతుడికి జల గండం లేకుండా వరుణుడూ, కాలదండం వల్ల చావు లేకుండా యముడూ, తన గద వల్ల హనుమంతుడికి ప్రమాదం కలగకుండా కుబేరుడూ వరా లిచ్చారు. తన వల్ల గాని, తన అస్త్రాల వల్ల గాని హనుమంతుడికి అపాయం లేకుండా శివుడు వరమిచ్చాడు. బ్రహ్మదేవుడూ, విశ్వకర్మా కూడా అలాటి వరాలే ఇచ్చారు. ఈ వరాలన్నిటి వల్లా హనుమంతుడు శత్రువులకు భయంకరుడూ, యుద్ధంలో ఓటమి లేనివాడూ, కామరూపీ, కామగమనం గలవాడూ అయాడు. వాయుదేవుడు పొందిన సంతోషం అంతా ఇంతా కాదు.

ఆ తరవాత హనుమంతుడు అపార బలసంపన్నుడై, నిర్భయంగా సంచరిస్తూ, ఆశ్రమాలలోని మునులకు నానా యాతనలూ కలిగిస్తూ వచ్చాడు. అతను దేవతల చేత వరాలు పొందిన వాడని తెలిసిన మునులు, అతను తమ నారబట్టలనూ,



అగ్ని హోత్రాలనూ, కుండలనూ, కృష్ణాజి నాలనూ ధ్వంసం చేస్తూ ఉన్నప్పటికీ చూసీ చూడనట్టుగా ఉండిపోయారు. ఒక వంక కేసరీ, మరో వంక వాయుదేవుడూ వద్దని చెబుతున్నా హనుమంతుడు తన ఆకతాయి తనం మానలేదు. చివరకు మహర్షులు హనుమంతుడి పైన అలిగి, "నీ బలం చూసుకునే గదా నువ్వీ దుండగాలు చేస్తు న్నావు? ఇంకొకరు చెబితే తప్ప నీ బలం నీకు తెలియకపోవు గాక!" అని అతడికి శాపం పెట్టారు.

అటు పైన హనుమంతుడు తన సంగతి తానే ఎరగకుండా బుద్ధిమంతుడై ఆశ్రమా లలో ఉంటూ వచ్చాడు. ఆ కాలంలో వాలి సుగ్రీవుల తండ్రి అయిన ఋక్షరజసుడు వానరరాజుగా ఉంటూ చనిపోయాడు. అప్పుడు వానరులు, పెద్దవాడైన వాలికి రాజ్యాభిషేకం చేసి, చిన్నవాడైన సుగ్రీవుణ్ణి యువరాజు చేశారు. హనుమంతుడికీ, సుగ్రీవుడికీ బాల్యంలోనే ఎడతెగని స్నేహం ఏర్పడింది. కాని, వాలికీ, సుగ్రీవుడికీ వైరం ఏర్పడి సుగ్రీవుడు నానా పాట్లూ పడి నప్పుడు హనుమంతుడు తన బలం తానే ఎరగని కారణం చేత అతనికి ఏ విధం గానూ సహాయపడలేక పోయాడు.

ఈ విధంగా హనుమంతుడి కథ రాము డికి చెప్పి అగస్త్యమహాముని, "రామా, ఈ హనుమంతుడు ఎలాటి శక్తి గలవా డనుకున్నావు? ఇతను వ్యాకరణం నేర్చుకోగోరి సూర్యుడితో బాటు ఉదయగిరి నుంచి అస్తగిరి దాకా తిరిగేవాడు. ఏ విద్య లోనూ ఇతనితో సమానులు లేరు. ఇతను ముందు కాబోయే బ్రహ్మ," అన్నాడు.

ఈ విధంగా హనుమంతుడి కథ విన్న రాముడు అగస్త్యుడితో, "స్వామీ, వాలి సుగ్రీవుల తండ్రి అయిన ఋక్షరజసు డెవరు? వారి తల్లి ఎవరు? ఆ కథ కూడా చెబితే సంతోషిస్తాను," అన్నాడు.





# వ్రతఫలం

కావేరీ తీరంలోని ఒక అగ్రహారంలో వేద పండితుడైన ఒక ధనిక బ్రాహ్మణు డుండే వాడు. అతడికి ఎంతో కాలంగా సంతానం లేకుండా వుండి, బాగా వయసు మళ్ళాక, ఒక ఆడపిల్ల పుట్టింది. లేకలేక పుట్టిన ఆ పిల్లకు శారద అని నామకరణం చేసి, అల్లారుముద్దుగా పెంచసాగాడు.

కొంతకాలం గడిచింది. శారదకు యుక్త వయసు వచ్చింది. అప్పుడామె తండ్రి అయిన వేదపండితుడు, కుమార్తెను వివాహ మాడగల యోగ్యుడైన యువకుడి కోసం, ఎన్నో గ్రామాలు గాలించి, చివరకు ఒక గ్రామంలో వేదాధ్యయనం చేసి సంస్కార వంతుడైన ఒక బ్రాహ్మణ యువకుడికి ఆమెనిచ్చి పెళ్ళి చేశాడు. అయితే పెళ్ళి రోజునే పాము కరిచి పెళ్ళికొడుకు మర ణించాడు. శారదకు పెళ్ళి ముహూర్తమే వైధవ్య ముహూర్త మయింది. ఆమె తన నగలన్నీ తీసేసి, పుట్టెడు దిగులుతో జీవితం గడపసాగింది.

ఇలా ఉండగా ధ్రువు డనే ఒక ముసలి బ్రాహ్మణుడు శారద ఇంటికి వచ్చాడు. శారద ఆయన పాదాలకు వందనం చేసింది. పుట్టు గుడ్డి అయిన ఆ ముసలి బ్రాహ్మణుడు, శారద వితంతువని తెలి యక, "దీర్ఘ సుమంగళీ భవ," అని దీవించాడు.

"స్వామీ, ఇదేమి ఆశీర్వచనం? నేను పెళ్ళి నాడే విధవరాలి నయాను," అని శారద వాపోయింది.

"తల్లీ, నేను జాత్యంధుణ్ణి. అందుచేత తెలుసుకోలేక పోయాను. అయినా నా నోట వచ్చిన ఆశీర్వచనం వృథా పోకూడదు. నీ చేత ఉమామహేశ్వర వ్రతం చేయిస్తాను. నా ఆశీర్వాదం నిజమై, నువు సుమంగళివి కాగలవు," అని ధ్రువుడు చెప్పాడు.

అట్ట చివరి బొమ్మ

శారద అత్యంత భక్తిశ్రద్ధలతోనూ, నిష్ఠతోనూ, వృద్ధబ్రాహ్మణుడు చెప్పిన విధంగా ఉమామహేశ్వర వ్రతం చేసింది. వ్రతం పూర్తి అయే సమయానికి పార్వతి ప్రత్యక్షమై, శారదను వరం కోరుకోమన్నది.

అప్పుడు ధ్రువుడు పార్వతీదేవికి తన ఆశీర్వాదం గురించి చెప్పి, శారద దీర్ఘసుమంగలి అయే లాగా అనుగ్రహించమని వేడాడు. పార్వతీదేవి శారద పూర్వజన్మ వృత్తాంతం ఈ విధంగా చెప్పింది:

కిందటి జన్మలో శారద పాండ్యదేశంలో ఉండే ఒక బ్రాహ్మణుడి భార్య. ఆ బ్రాహ్మణుడికి ఇద్దరు భార్యలు. శారద అతని రెండో భార్య. శారద చాలా అందమూ, ఆకర్షణా కలది కావటం చేత, భర్త ఆమెనే ప్రేమించి, అస్తమానమూ ఆమెతోనే ఉంటూ, తన పెద్ద భార్యను పూర్తిగా అలక్ష్యం చేశాడు. భర్త తనపై చూపే ప్రేమకు గర్వించి, శారద తన సవతిని ఎన్నో అవమానాలపాలుచేస్తూ, ఇంటి దాసీకన్న హీనంగా ఆమె చేత పనులు చేయిస్తూ వుండేది. భర్త యీసడింపూ, సవతి పెట్టే బాధలూ భరించలేక ఆమె మనోవ్యాధిపడి తీసుకుని, మరణించింది.

ఇది ఇలా ఉండగా మరొక బ్రాహ్మణ యువకుడు శారద అందానికి బందీ అయి



పోయి, ఆమెను విపరీతంగా మోహించాడు. కాని పతివ్రత అయిన శారద ఆ యువకుణ్ణి దగ్గిరికి రానివ్వలేదు. దానితో ఆ యువకుడు మతిచలించినవాడై, దేశాలు పట్టి తిరుగుతూ, అహోరాత్రాలు శారదనే స్మరిస్తూ ప్రాణాలు విడిచాడు.

ఈ జన్మలో ఆ యువకుణ్ణే శారద పెళ్ళాడింది. అందుకు కారణం అతను చచ్చిపోయేటప్పుడు కూడా ఆమెనే స్మరిస్తూ ఉండటం. అయితే కిందటి జన్మలో శారదకు సవతి అయిన స్త్రీ పాము రూపంలో వచ్చి ఆ యువకుణ్ణి కరిచింది; శారద కిందటి జన్మలో తనకూ, భర్తకూ ఎడబాటు కలిగించింది గనక, ఈ జన్మలో ఆమె శారదకూ, ఆమె భర్తకూ ఎడబాటు కలిగించింది.

పార్వతి ముసలి బ్రాహ్మణుడికీ వృత్తాంతం చెప్పి, "శారద ఎంతో భక్తితో వ్రతం చేసింది. నేను సంతోషించాను. ఈమెకు సుమంగలీత్వం కలిగే ఉపాయం నేను చేస్తాను. ఈమె పూర్వ భర్త తిరిగి పాండ్యదేశం లోనే పుట్టాడు. కాలక్రమాన వీరిద్దరూ కలుసుకుని, తిరిగి భార్యాభర్తలవుతారు," అని అంతర్థాన మయింది.

"అమ్మా, పార్వతీదేవి చెప్పిన సంగతులు విన్నావుకదా? ఇక దిగులుమాను. నీ వ్రతం ఫలించింది. నా ఆశీర్వచనమూ



నిజమవుతుంది. భక్తిశ్రద్ధలతో పార్వతీదేవిని స్మరిస్తూ, కాగలదానికి వేచివుండు," అని చెప్పి ధ్రువుడు వెళ్ళిపోయాడు.

ఇది జరిగిన తరవాత శారదకు రోజూ కలలో ఒక బ్రాహ్మణ యువకుడు కనిపించి, ఆమెతో ఉంటూ వచ్చాడు. కొంత కాలానికి ఆమె గర్భవతి అయింది. ఈ సంగతి బయటపడగానే ఊళ్ళోవాళ్ళు ఆగ్రహించి, "ఇది కులట, పతితురాలు. దీని ముక్కూ, చెవులూ కొయ్యాలి," అని ఆర్భాటం చేశారు.

అప్పుడు ఆకాశం నుంచి, "ఈమె మహా పతివ్రత. ఈమెను నిందించే వారి తలలు బద్దలైపోతాయి," అనే మాటలు వినిపించాయి. దానితో వాళ్ళు బెదిరిపోయి, ఆమెను నిందించటం మానారు. శారద కూడా ఎంతో సిగ్గుపడి, తాను కలలో ఎవరితోనో సంసారం చేస్తున్న సంగతీ, దాని ఫలితంగా గర్భవతి అయిన సంగతీ అందరికీ చెప్పింది. సకాలంలో ఆమె ఒక మగ పిల్లవాణ్ణి కన్నది.

కొంత కాలం గడిచింది. శారద తన కుమారుణ్ణి వెంటబెట్టుకుని గోకర్ణ క్షేత్రానికి వెళ్ళింది. అక్కడికి నానాదేశాల వారు వచ్చారు. వారిలో పాండ్యదేశం నుంచి వచ్చిన ఒక బ్రాహ్మణుడు శారదను చూసి, ఆమె తన స్వప్న పత్ని అని గుర్తించి ఆమెను సమీపించి పలకరించాడు. శారద అతణ్ణి చూస్తూనే అతడు తన స్వప్న భర్త అని గుర్తించింది.

ఇద్దరూ మాట్లాడుకోవటంలో ఒకరి సంగతి ఒకరికి తెలిసిపోయింది. శారద ధ్రువుడి ఆశీర్వచనం సంగతీ, పార్వతీదేవి అనుగ్రహించిన వరం సంగతీ అతడితో చెప్పింది. ఆ బ్రాహ్మణుడు ఎంతో సంతోషించి శారదను తన దేశానికి తీసుకుపోయి ఆమెను తన భార్యగానూ, ఆమె కొడుకును తన కొడుకుగానూ ఏలుకున్నాడు.



# 51. రష్మోర్ శిఖరం

గుట్జన్ బోర్గ్లమ్ అనే శిల్పి, అమెరికా లోని ఈ పర్వత శిఖరాన అమెరికా అధ్యక్షులు నలుగురిని—వాషింగ్టన్, జెఫర్సన్, థియొడోర్ రూజవెల్ట్, లింకన్‌లను—చెక్కాడు. ఒక్కొక్క తల 60 అడుగుల ఎత్తుంటుంది. ఈ పని 14 ఏళ్ళు పట్టింది. ఈ శిల్పి 1941 లో పోయాడు.



Photo by Vidyavrata



బహుమతి
పొందిన వ్యాఖ్య

కావాలి ఆహారం

పంపినవారు:
డి. పద్మావతి, మచిలీపట్నం

Photo by N. Ramakrishna



బహుమతి
పొందిన వ్యాఖ్య

చేస్తున్నాం ఫలహారం

పంపినవారు :
డి. పద్మావతి, మచిలీపట్నం

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1966 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి )

★ ఫిబ్రవరి నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

---

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : కావాలి ఆహారం

రెండవ ఫోటో : చేస్తున్నాం ఫలహారం

పంపినవారు : డి. పద్మావతి,

బలరాముని పేట, మచిలీపట్నం.

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# నాకు ఏమయింది చెప్మా?



నేను రోజంతా అలసిపోయి ఉండేదాన్ని. ఆ చిరాకుతో కస్సుబుస్సుమని అపర కాళిలా ఉంటే నా దగ్గరకు ఎవరూ చేరేవారుకాదు.

నా అలసటకు కారణము మా డాక్టరు కనిపెట్టేరు. సరియైన పోషణ లేకపోతే యిలాగే అవుతుందన్నారు. నన్ను హార్లిక్స్ త్రాగమన్నారు

హార్లిక్స్ నాకు శక్తి ఉత్సాహములను కలిగించింది. నేను మళ్లీ మామూలు దాన్ని అయేను. హార్లిక్స్ చేసిన మేలు మరవలేను!

పూర్తిగా పోషణలేక నిరుత్సాహముగా ఉంటే డాక్టర్లు హార్లిక్స్‌ను సిఫారుసు చేస్తారు. పూర్తి మీగడగల పాలతోను గోధుమపిండి, మాల్టెడ్ బార్లీ సారములుగల ఉచితమైన హార్లిక్స్ త్వరలోనే శక్తి నిస్తుంది.

## హార్లిక్స్

అదనపు శక్తిని కలిగించును!

Horlicks



# బ్రిటానియా

# గోల్డెన్ పఫ్




బ్రిటానియా వారే ప్రత్యేకంగా తయారుచేసే యీ గోల్డెన్ పఫ్ బిస్కట్లు తాజాగా కరకరలాడుతూ వుండి పుష్టినిచ్చును. కాఫీ, టీ, త్రాగేటప్పుడు సేవించుటకు అనువైనవి. జామ్, వెన్న, జున్నుంతో కూడ సేవించవచ్చును. రుచి చూడండి — నోట్లో కరిగిపోతాయి. నేడే కొనండి. కమ్మగా రుచిగా వుండే యీ తాజా బ్రిటానియా గోల్డెన్ పఫ్ బిస్కట్లను సేవించి ఆనందించండి.

## బ్రిటానియా బిస్కట్లు






JWTBC 5910 A

